# స్వారాజ్యం

భమిడిపాటి కామేశ్వరరావు

పబ్లిషర్సు
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# హెచ్చరిక

కేవలం వినోదం నిమిత్తమైనాసరే, లేక సొమ్ము వసూలు చేసుకునే నిమిత్తమైనాసరే, ఈ ప్రదర్శనాలలో ఎద్దైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘం వారున్నూ, ముందుగానే, గ్రంథ కర్తకై వ్రాసి లిఖితానుమతి పొందక పోవడం కాపీరైట్ చట్ట ప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొంది తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు
రాజమంద్రి

# విషయసూచిక

5 ఇలు-2-34

# స్వ రా జ్యం

[ప్రదర్శనం, దైవజ్ఞుడైన 'విలియం ఫ్రెడరిక్ ఫెరార్' అనే ఆంగ్లరచయిత (1831-1903) సృష్టించిన 'ఎరిక్' అనే ఒక నవలలోని ఒక సన్నివేశ వృత్తాంతం దీని కథావస్తువు. ఇది 16-4-1953 తేదీని, శ్రీ తోలేటి కనకరాజుగారి అధ్యక్షత క్రింద, వీరేశలింగజయంతి సందర్భంలో, వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాలలో, విద్యార్థి బృందం మొదటి సారిగా ప్రదర్శించారు]



పా త్ర లు

| | |
|---|---|
| అవినాశం | ఆరోగ్యం |
| కిరీటి | సంతానం |
| చిట్టి | శంకారం |
| నవరస్ | శేఖరం |
| పతాకం | కరటకం |
| భైరవం | |
| కమలం | (మొదటి పన్నెండుగురున్నూ విద్యార్థులు. చివరి |
| ఆనందం | వాడు బంట్రోతు) |

# స్వ రా జ్యం

[ఒక హాలు. చిన్న టేబిలు, దానికి చేర్చి ఒక కుర్చీ. పక్కని అయిదుగురు కూర్చోడానికి ఒక బెంచీ. రంగం నిండేలాగ చాలామంది విద్యార్థులు రంగంమీదికి వచ్చి, చాలా గందర గోళంగా మాట్లాడుతూ ఉంటారు. కొందరు కూచున్నా, చాలా మంది నిలబడే ఉంటారు].

అవినాశం—(రంగం మీదికి వచ్చి, ఈలవేసుగుంటూ బెంచి వైపు నడిచి, బెంచిమీద నుంచుని, గోల తగ్గించడానికి యత్నం చేస్తూ, కుడిచెయ్యి పైకెత్తి) ప్రియసోదరులారా, స్నేహితులారా! మనం అంతా ఒకేపక్షంవాళ్ళం. బోధమిషతో మన్ని దాకపెట్టే శత్రుపక్షంవాళ్ళు ఇక్కడ లేరు. కాబట్టి, గొడవ చెయ్యడం మరి మానండి. అదిమేవాడు లేనప్పుడు అల్లరికి రాణింపు ఉండదు. మన యీ సమావేశం తమాషాకోసం కాదు. మనం ఇప్పుడు కొంత వ్యవహారం ఆరిందాగా జరపాలి. ఒక న్యాయవిచారణ చేసెయ్యాలి. న్యాయవిచారణ కష్టంతోకూడిన పవిత్ర వ్యాపారం. న్యాయవిచారణ చేసేవాళ్ళు, పాతవైషమ్యాల తాలూకు మిగిలిన విషం కక్కుగోడానికి, అది ఒక తరుణం అనుకోకూడదు, ఎక్కడా బుద్ధిలోపం రానియ్యకూడదు.

చిట్టి—ఆ న్యాయవిచారణ ఏదో నువ్వే నడిపించు, అవినాశం! అధ్యక్షపదవి స్వీకరించు.

తంకారం—ఇప్పుడు చిట్టి చేసిన ప్రతిపాదన నేను బలపరుస్తున్నాను.

అందరూ—మేం ఆమోదిస్తున్నాం.

అవి—సోదరులారా! చిట్టి ప్రతిపాదించాడు, రంకారం బలపరిచాడు, సభ్యులు ఏకగ్రీవంగా ఆమోదించారు. కనక నేను కార్యక్రమం ఆరంభించి నడిపిస్తాను. ఈ విషయంలో బుద్ధిలోపం రానియ్యకూడ దన్నాను. హృదయ శూన్యత్వమూ ప్రకటించ కూడదని చెబుతున్నాను, గమనించండి. అయితే, బాలురంతా సర్దణిగి కూచోండిమరి.

(అంతా కూచుంటారు. నిశ్శబ్దంగా ఉంటుంది)—స్నేహితు లారా! ఈ సమావేశంయొక్క ఉద్దేశం సభ్యులందరికీ తెలుసు ననే భావిస్తున్నాను. మన స్కూలు హాలుగదిలో ఉంటూండే బ్లాక్‌బోర్డుకి ఒక కాగితం అతిగించి ఉన్నట్టు గత శనివారం ఉదయం తెలిసింది. ఆ కాగితంమీద చాలా చెడుమాటలు రాసి ఉన్నాయి. ఆ మాటలు ఏవి అంటే: 'గరుడాచలం ఒక మొండి పిశాచం', అని. ఈ రచన యొక్క లేఖకుడు ఎవడో నిష్క ర్షగా తేల్చి నిర్ణయించే టందుకే ఇప్పుడు మన యత్నం. గరుడా చలం మేష్టారికి, ఈ సంగతి తెలిసేసరికి ఎంతకోపమేనా వచ్చింది. సహజంగదా! తక్కిన ఉపాధ్యాయులు బెదిరి చిన్న బుచ్చుకున్నారు. దొంగచాటు రాతగాడు తను బతిగిఉండగానే మరణించినట్టు ఒప్పుగోడం అని, చెబుతూ, ప్రధానోపాధ్యాయుడు ఈ రాతగురించి చప్పరించారు. నేరంచేసిన ఘటం ముందుకొచ్చి 'నేను' అని తెగేసి చెప్పి, ఒప్పేసుగోలేక పోయాడు. కొంత కొంత దాఖలాగా ఉన్న కొన్ని కొన్ని సందర్భాలవల్ల, ఒకా నొక విద్యార్థిమీద—కిరీటి అనే విద్యార్థిమీద—అనుమానం ఛాళా

మందికి ఉంది. కాని, ఆ విద్యార్థి పాడుపన్లు చేసేరకం కాడు. ప్రస్తుతం ప్రధానోపాధ్యాయుని సూచన ఏమంటే: విద్యార్థులే ఒక సక్రమ విచారణ జరిపి, సాక్ష్యం సేకరించి, సమాలోచన చేసి, ఈ విషయంలో, పెద్దలసాయం ఎంతమాత్రమూ లేకుండా తమలో తమగు ఏమి నిర్ణయించుకోగలరో చూడడం; కర్తవ్యా లన్నింటిలోకీ మిక్కిలి ప్రశస్తం—అని. కిరీటి ఇక్కడ ఉన్నాడా?

నవరస్—(లేస్తాడు)

అవి—ఏం నవరస్! కిరీటి?

నవ—వస్తూంటాడు, తీసుగువస్తాను. (అని కుడిఎదరికి వెళ్ళి అప్పుడే కిరీటిని వెంటతీసుగు వస్తాడు.)

అవి—ఏం కిరీటీ! గరుడాచలం మేష్టార్ని దూషిస్తూ నువ్వు ఒక కాగితం రాసి హాలుగదిలో ఉండే బ్లాక్‌బోర్డుకి అతికించా వనే నేరం స్కూలువారు నీ మీద మోపి న్యాయవిచారణ చెయ్య దల్చుకున్నారు. నీకు ఇష్టమే కదా?

కి—ఓ. నాకు ఎంతోఇష్టం. ఇంతకంటె నాకు ఎక్కువ ఇష్ట మైంది మరి ఉండదు.

అవి—భేష్. సరే. నేరంయొక్క ప్రతిపాదన ఎవరుచేస్తారో, రండి.

[అంతా ఒకరిముఖం ఒకరు చూసు గుంటారు. చాలా నిశ్శబ్దం.]

—అయితే సరే. నేరాన్ని ప్రతిపాదన చెయ్యడానికే మనిషి లేనప్పుడు, నేరంయొక్క ఆరోపణా ఉండదు, నేరమూ ఉండదు. మనం శీఘ్రంగా దయచెయ్యవచ్చు.

చిట్టి—(లేచి) నే చేస్తాను,

అవి—నేరాన్ని ప్రతిపాదించడంలో ఉండే గొప్ప బాధ్యత నువ్వు వహిస్తున్నందుకు నీకు వందనాలు, చిట్టీ! అది సరే. ముద్దాయి తరపున ఎవరు వకాల్తీ పుచ్చుగుని వాదిస్తారూ?

ఆరోగ్యం—(నిలబడతాడు.)

కి—ఈ ఆరోగ్యం నా తరపున మాట్లాడాలని నేను కోరను. ఇతను నన్ను గురించి నిత్యమూ శంకించే రకం, నా అమాయికత్వం గురించి ఎవరు ఒక సారేనా కుడా సందేహించలేదో అటువంటి వారే నా తరపున వాదించాలని నా కోరిక.

నవ—(కొంచెం సిగ్గుతో నిలబడి) నేను ఆరవ ఫారంవాణ్ణి కాకపోయినా, తనకేసు నేను పట్టడం తనకి ప్రమాదమేమో అనే భయం కిరీటికి లేకుండా ఉంటే, కిరీటిపక్షం నేను వాదిస్తాను.

కి—నీకు దణ్ణం, నవరస్! మరి నేను బతిగిపోయా నన్నమాటే. ఈ మాట నువ్వు ఎప్పుడంటావా అని చూస్తున్నాను. నా పక్షం వాదించడానికి నీ కంటె మరెవర్ని చెప్పగలనూ?

నవ—సరే. ఆనందం. శంకారం, సంతానం—మీరు నాకు అవసరంవస్తే సాయితా అవుతారు కాదూ!

ఆనం—
శంకా— } ఓ, మహరాజులాగ;
సంతా—

అవి—కిరీటీ! (బెంచీకి దగ్గిరిగాఉండే అయిదుగుర్ని ఎవర్నో చూపిస్తూ) ఈ అయిదుగురు ఆరవఫారం వాళ్ళూ పంచాయితీగా

ఉంటారు, వీళ్ళల్లో ఏ ఒకర్ని గురించీ కుడా నీకు ఆక్షేపణ లేదన్న మాటేగదా!

కి—లేను. పంచాయితీదార్లు ఎవరైనా సరే నాకు ఒప్పందమే.

అవి—(ఆ అయిదుగుర్నీ ఉద్దేశించి) మీ పంచాయితీవారు ఈ బెంచిమీద కూచోండి. ఇక నేర ప్రతిపాదన ప్రారంభించవచ్చు.

చిట్టి—న్యాయమూర్తీ, పంచాయితీ మహాశయులారా! ఏ యే నెపాలు పురస్కరించుగుని కిరీటిమీద అనుమానపడవలిసి వచ్చిందో విశదీకరిస్తాను, అవి వొట్టి నెపాలుకావు. కిరీటి నేరస్థుడే అని ఋజువు చెయ్యడానికి కావలిసిన సాక్ష్యం రాబట్టి మీకు దాఖలా ఇస్తాను. ఒక్క విషయం మాత్రం ఎవ్వరూ ఏమర కూడదు. శుక్రవారం సాయంత్రం బ్లాక్ బోర్డు ఖాళీగా ఉంది, కాని, శనివారం ఉదయానికి దానిమీద ఒక కాగితం అతికించి ఉంది. ప్రతిరోజూ మనస్కూలు ఆరు గంటలతో ఆఖరు, ఆ తరవాత మామూలుగా ఒక పావుగంటకి గదులకి రోజూ తాళాలు వేస్తూంటారు. కాబట్టి, ఈ నేరం శుక్రవారం సాయంత్రం ఆరుగంటలకీ ఆరుంపావుకీ ఉండే వ్యవధిలో జరిగి ఉండాలి. ఒక్కొక్క సాక్షినే పిలిచి వాఙ్మూలం ఇమ్మంటాను,

పతాకం! రావోయ్, సాక్షిస్థానంలో నుంచో.

పతా—(లేచి, సాక్షిస్థానంకేసి వెళ్ళి, బోనెక్కుతాడు)

చిట్టి—ప్రమాణంచెయ్యి

పతా—ఏమనీ?

చిట్టి—(మాట మాటచొప్పునే అనిపిస్తూ) దేవుని ఎదట—ప్రమాణంచేసి—నిజం చెబుతాను—నిజం అంతా చెప్పేస్తాను—నిజంకానిది చెప్పను.

సరే, పతాకం! శుక్రవారం సాయంత్రం ఆఖరుగంట కొట్టెయ్యగానే నువ్వు హాలుగదిలోంచి వెళ్ళిపోయావా?

పతా—లేదు.

చిట్టి—ఏం? ఎందుకు దిగడిపోయావు?

పతా—మేష్టారు రెండు పేజీలు ఇంపొజిషన్ ఇస్తే, రాసుగుంటూ ఉండిపోయాను.

చిట్టి—అరుగంటల తరవాత ఏమాత్రంసేపు ఉన్నావు!

పతా—పదినిమిషాలు.

చిట్టి—నువ్వు వెళ్ళిపోయేటప్పుడు ఆగదిలో మరెవరేనా ఉన్నారా!

పతా—ఆ.

చిట్టి—ఎవరు?

పతా—కిరీటి.

చిట్టి—చాలు. నువ్వు దిగు. బంట్రోతు కరటకాన్ని పిలు, ఠంకారం!

ఠం—(కుడి ఎదరకి నడిచి) కరటకం!

కర—(కుడి ఎదరనించి వస్తూ) అయ్య.

చిట్టి—సాక్షిస్థానంలో నుంచో.

కర—చిత్తం. (అని అక్కడనుంచుంటాడు)

చిట్టి—ప్రమాణం చెయ్యి. (అని, మాట మాట చొప్పునే అనిపిస్తూ) దేవుని ఎదట-ప్రమాణం చేసి - నిజం చెబుతాను-నిజం అంతా చేప్పేస్తాను-నిజంకానిది చెప్పను.

సరే. కరటకం! శుక్రవారం సాయంత్రం హాలుగది ఎప్పుడు తాళం వేశావు?

కర—బహుశా, ఆరుంపావు అవుతుంది.

చిట్టి—నువ్వు—ఆగది తాళం వెయ్యడం నిమిత్తం వెళ్ళినప్పుడు, నీకు ఎవరేనా ఎదురయారా ?

కర—ఆ. కిరీటిగారు గబగబా ఆగదిలోంచి బయటికి వస్తూ, నాకెదురై వెళ్ళిపోయారు.

చిట్టి—అది సరేకాని, లోపలమరెవరేనా ఉంటూండగానే, తాళం వెయ్యలేదుకద నువ్వు ?

కర—అబ్బే, నయం. లోపల మరెవరూలేరు,

చిట్టి—అప్పట్లో మరెవరేనా వెళ్లడం నువ్వు చూశావా ?

కర—అబ్బే, లేదు.

చిట్టి—చాలు, నువ్వు దిగు.

నవ—(నుంచుంటాడు).

చిట్టి—నవరస్ ! ఈసాక్షిని, నువ్వు, కావలిస్తే క్రాసు పరీక్ష చేసుగోవచ్చు.

నవ—కరటకం ! ఒక చిన్న విషయం అడుగుతాను చెప్పు. ఆ గదికి తాళం వేసిన తరవాతకుడా ఆ గదిలో ఎవరేనా ప్రవేశించ వచ్చా ?

కర—ఓ. దివ్యంగా ప్రవేశించవచ్చు.

నవ—ఎట్లా !

కర—అవతల గోడకి ఉన్న కిటికీల్లోంచి.

నవ—సరే. చాలు. నువ్వు దిగవచ్చు.

కర—(దిగి, పక్కని ఎడంగా నిలబడతాడు)

నవ—శంకారం ! ఇల్లారా ! (అని, అతడు తనవగ్గిరికిరాగా, అతడి చెవులో ఏదో చెబుతాడు),

రం—(కుడి ఎవరనించి వెళ్ళిపోతాడు.)

చిట్టి—భైరవం! రా, సాక్షిస్థానంలోకి.

భై—(సాక్షిస్థానంలో నిలబడతాడు)

చిట్టి—ప్రమాణం చెయ్యి (అని, మాటమాట చొప్పునే అతడిచేత అనిపిస్తూ) దేవుని ఎదట-ప్రమాణం చేసి-నిజం చెబుతాను- నిజం అంతా చెప్పేస్తాను-నిజం కానిది చెప్పను.

సరే, భైరవం! నువ్వు కిరీటిని బాగా ఎరుగుదువా?

భై—ఆ.

చి—అతను ఏ సిరాతో రాస్తూంటాడో నీకు తెలుసా?

భై—ఆ తెలుసు, అది మామూలురకంకాదు; ఊదారంగుది. ఏదో వాసనకుడా వేస్తూంటుంది.

చి—ఆ సిరాతో రాసిందేదేనా నువ్వు పోల్చుకోగలవా?

భై—ఓ. తక్షణం.

చి—(చిక్కులకన్నింటికీ కారణభూతమైన కాగితం భైరవానికి చూపిస్తూ) ఈ రకమేనా ఆ సిరా?

భై—అవును. ఈ రకమే.

చి—ఈ కాగితం మీది దస్తూరీ ఎవరిదో చెప్పగలవా?

భై—ఓ. ఇది కిరీటి దస్తూరీ.

చి—ఎల్లా పోల్చగలవ్, ఇది కిరీటి దస్తూరీయే అని?

భై—'డ' అనే అక్షరంతో సంబంధించిన గుర్తులు, అతను, అదొక తమాషాగా రాస్తాడు.

చి—ఈ కాగితంయొక్క పై అంచుకి మధ్య ఒక జిగురు పీలిక ఉంది చూడు. ఇల్లాంటి జిగురుపీలికలు భూశావా ఎక్కడేనా?

భై—చూడకేం, చూశాను. కిరీటి దగ్గిర ఇల్లాంటివి డెస్కు నిండా ఉన్నాయి.

చి—మరెవరిదగ్గిరేనా ఇలాంటి పసుపుపచ్చటిరంగు జిగురు పీలికలు ఉండడం నువ్వు ఎరుగుదువా?

భై—ఎరగను.

చి—సరే, చాలు.

సవ—(లేచి, తంకాచాన్ని పిలిచి, అతడితో ఏదోచెప్పి కూర్చుంటాడు.)

తం—(నుంచుంటాడు)

చి—క్రాసా? ఓ. చేసుగోవచ్చు.

తం—ఇల్లాంటి జిగురుపీలికలు కిరీటిదగ్గిర ఉండడం నువ్వేల్లా గ్రహించావ్, భైరవం?

భై—అతడు వాడుతూంటే చూశాను.

తం—ఎందునిమిత్తం వాడుతూంటే చూశావు?

భై—ఉత్తరాల కవర్లు అతిగించేటప్పుడు.

తం—అబ్బా! కిరీటి వస్తువుల గురించీ, కిరీటి చేష్టలగురించీ సర్వమూ కనిపెట్టిన వాడవులా కనిపిస్తున్నావే! నీకు తెలిసినన్ని వయినాలు అతణ్ణిగురించి అతడి ఆంతరంగికులకి కుడా తెలియవే! ఇక్కడ సమావేశమైన ఇంతమందిలో మరి ఏ ఒకరికైనా తెలుసునండీ, కిరీటి తన ఉత్తరాలగురించి వాడుకుంటూండే జిగురుపీలికలగురించీ?

ఆరో—(మరికొందరితోకలిసి) తెలియదు, తెలియదు.

తం—అంతే.

చి—నువ్వు దిగివచ్చు, భైరవం.

భై—(దిగి కూచుంటాడు).

చి—ఆరోగ్యం! రా. ప్రమాణం చెప్పు.

ఆరో—(సాక్షిస్థానంలో నుంచుంటాడు).

చి—(మాట మాట చొప్పునే అనిపిస్తూ) దేవుని ఎదట—ప్రమాణంచేసి—నిజంచెబుతాను—నిజం అంతా చెప్పేస్తాను. నిజంకానిది చెప్పను.

—కిరీటిగురించి నీకు చాలా తెలుసుకాదూ ?

ఆరో—(చిరునవ్వుతో) ఓ. తెలుసు.

చి—గరుడాచలం మేష్టారుగురించి నీ సమక్షంలో అతడెప్పుడేనా రిమార్కు చెయ్యడం విన్నావా ?

ఆరో—ఆ. తరుచు.

చి—ఏరకం అభిప్రాయాలు వెలిబుచ్చేవాడూ ?

ఆరో—చచ్చినంత అయిష్టంతోనూ పరమ అసహ్యంతోనూ కూడిన అభిప్రాయాలు.

చి—గరుడాచలం మేష్టారుమీద కసితీర్చుగుంటానని కిరీటి శపథం చేశాడా ?

ఆరో—ఆ. గరుడాచలంగారు కిరీటికి ఓ ఇరవై పేజీలు ఇంపొజిషన్ ఇచ్చినప్పుడు అన్నాడు.

చి—ఆ బెదిరింపు ఎప్పుడు ప్రకటించాడూ ?

ఆరో—శుక్రవారం మధ్యాహ్నం.

చి—సరే చాలు.

నవ—(లేవబోతూంటాడు)

చి—కావలిస్తే క్రాస్‌పరీక్ష చేసుకో.

నవ—ఆరోగ్యం ! నీకు తెలిసినంతవరకు కిరీటి ఎన్నడైనా నీచపుపని చేశాడా ?

ఆరో—ఎన్నడూ చెయ్యలేదు.

నవ—ప్రస్తుత సందర్భంలో నేరంచేసినవాడు కిరీటి అయి ఉండవచ్చు నంటావా ?

ఆరో—ఎంతమాత్రమూ అనను. సరిగదా, ఈ నేరానికీ కిరీటికీ సంబంధం లేశమైనా ఉండదని నా నిశ్చితం—అంటాను.

నవ—సరే. నువ్వు వెళ్ళచ్చు.

ఆరో—(వెళ్ళిపోతాడు)

చి—కమలం, రా. వచ్చి సాక్షిస్థానం ఎక్కు.

కమ—(సాక్షిస్థానం ఎక్కుతాడు)

చి—ప్రమాణం చెయ్ (అని, మాట మాట చొప్పున అనిపిస్తూ) దేవుని ఎదట, ప్రమాణంచేసి—నిజం చెబుతాను- నిజం అంతా చెప్పేస్తాను—నిజంలేనిది చెప్పను. సరే, కమలం ! ఈ తలవంపు వ్యవహారం గురించి నీ కేమన్నా తెలుసునా ?—అని నలుగురి ఎదటా, ప్రధానోపాధ్యాయుడు కిరీటిని అడిగి నప్పుడు నువ్వు హాజర్ లేవూ ?

కమ—లేకేం ! కిరీటి పక్కనే ఉన్నాను.

చి—అప్పుడు కిరీటి మొహం ఎల్లా ఉందీ ?

కమ—ఆ ప్రశ్నతో కిరీటి మొహం మారిపోయింది. ఏదో జ్ఞాపకంవచ్చి అతడు ఆందోళన పడుతూన్నట్టు అతడి మొహంలో స్పష్టం అయింది.

చి—సమాధానం ఏరీతిగా చెప్పాడూ ?

కమ—మెల్లిగా, తెఃతెల్లబోతూ, 'నాకు-ఏమీ తెలియదండి' అని, గుటకలేస్తూ నసుగుతూ అన్నాడు.

చి—ఇక చాలు. నవరన్, ఏమన్నా 'క్రాస్' ఉందా ?

నవ—లేదు.

చి—నువ్వు దిగి వెళ్ళచ్చు, కమలం.

కమ—(వెళ్ళిపోతాడు).

చి—న్యాయమూర్తీ, పంచాయతీ మహాశయులారా ! నేను ప్రతిపాదించి స్థాపించిన యథార్థాలు ఇవి :

నేరం జరిగి ఉండవలిసిన సమయానికి పూర్వం, కిరీటి, గరుడాచలం మేష్టారుమీద కసితో ఉన్నాడు. గరుడాచలంగారికి తగ్గశాస్తి చేస్తానని కిరీటి శపథం చేశాడు. పైగా, నేరం జరిగి ఉండవలిసిన కాలంలో, నేరంజరిగిన స్థలంలో, కిరీటి ఒక్కడు మాత్రం ఉన్నాడు. ఈ రచన యొక్క దస్తూరీ కిరీటి దస్తూరీని పోలి ఉంది. ఈ రచన లిఖించడానికి వాడిన ఊదాసిరాయేకాక, ఈ రచన లిఖించిన కాగితం ఆ బోర్డుకి అతికించడానికి వాడిన పసుపుపచ్చటి జిగురుపీలికలుకుడా, కిరీటిదగ్గిర మాత్రమే ఉండే రకంవి అని తేలింది. అన్నింటినీ మించి, ఈ విషయం గురించి, పబ్లీకున దర్యాప్తు చేస్తూ ప్రధానోపాధ్యాయుడు వరసక్రమంలో కిరీటిని ప్రశ్నించి నప్పుడు కిరీటివాలకమూ వైఖరీ అచ్చంగా నేరస్థుడైన మనిషియొక్క వాలకమూ వైఖరీలాగే కనపడింది. ఈ సబబుల్ని బట్టి నేరం కావించినవాడు కిరీటే అని మీ మనస్సుకి నచ్చిందని నా నమ్మకం. నేరస్థాపన ఇంతటితో సమాప్తి.

(అంతా చప్పట్లు కొడతారు. చిట్టి వెళ్ళి కూచుంటాడు).

అవి—మరి, ముద్దాయి తరఫు సాక్ష్యం ఆరంభించు, నవరస్.

నవ—(లేచి) కిరీటీ! నీ డస్కు తెప్పించి, అందులో ఉండగల పదార్థాలు అవసరమైతే న్యాయమూర్తుల ఎదట దాఖలు చేస్తాను. ఆ విషయంలో నీకు ఎటువంటి అభ్యంతరమూ లేదు కదా?

కి—నా డెస్కు ఇక్కడికి తేవడానికి నాకు ఎటువంటి అభ్యంతరమూలేదు, నిరాక్షేపణగా తీసుగురావచ్చు. ఇదుగో దాని తాళం చెవి. (అని, తాళంచెవి ఇస్తాడు).

నవ—కరటకం! కిరీటి డెస్కుపెట్టె తీసుగురా.

కర—(వెళ్ళి, మరొకరు సాయం చెయ్యగా, డెస్కుపెట్టె తెచ్చి రంగం మీద ఉంచుతాడు).

నవ—(పెట్టె పరీక్షిస్తూ) ఇకనేం? తాళం తీసేఉంది. తాళం చెవి అక్కర్నేలేదు.

—న్యాయమూర్తీ, పంచాయతీ మహాశయులారా! నేరస్థాపన పక్షంవారు సాక్షుల్ని లేవదీసి ఎంత తంటాలు పడితేంగనక, కిరీటి నేరకాడు కాడని, నేను తమ ఎదట ఋజువు చేస్తాను. గరుడాచలంగారిని గురించి, కిరీటి, అవాచ్యాలు నోటితో అని ఉండడం నేనూ ఒప్పుగుంటాను. ఊదాసిరా, పసుపుపచ్చటి జిగురుపీలికలూ కిరీటిడెస్కులో ఉండే మాదిరివే అనీ ఒప్పుగుంటాను. ఈ కాగితం మీది దస్తూరీ కిరీటి దస్తూరీలాగ లేకపోలేదు—అని కూడా నేనూ అంగీకరిస్తాను. ఇన్నీ ఒప్పుగుంటూ, ఈ కాగితం మీద అక్షరాలు రాసిన వ్యక్తి, కిరీటిఅయి ఉండ

ఉండగలడా అనే విషయం కోర్టువారు పరిశీలించాలి అని మనవి చేస్తున్నాను. దయచేసి గమనిచండి. శుక్రవారం నాటికే కిరీటికి గరుడాచలంగారి మీద కోపం వచ్చిందీ!—అక్కణ్ణించి, ఆ మేష్టారి పరోక్షంలో ఆ మేష్టార్ని నానా తిట్లూ తిట్టి ఆయన్ని ఓ తడాఖా తీస్తానని ఆ మధ్యాహ్నమే కిరీటి బెదిరింపులు బెదిరించాడూ!— ఆ సాయంత్రమే కిరీటి, గాలికి పోయిన తన తిట్లన్నీ మళ్ళీ ఏరుకువచ్చి, వాటిని లిఖితంకుడా చేసి, 'నన్ను వెంటనే పట్టేసుగోండయ్యా, రూఢిగా శిక్షించడయ్యా, అన్నట్టు అమోఘంగా దొరికిపోయే విధంగా వ్యవహరించాడా? వ్యవహరిస్తాడా? అట్లా వ్యవహరించడం ఎక్కడేనా ఉంటుందా? ఈ కాగితం మీద రాసినవాడు కిరీటే అయి ఉంటే, అతడు తన స్వంత దస్తూరీ రాసుంటాడా? స్వంతం మాటుపరిచేసి, మరొకరి దస్తూరీలాగ కనపడేటట్టు రాయడానికి యత్నించి ఉండడూ? చెప్పిస్తానుండండి. ఎవరేనారండి. ఇల్లారా, అనందం! ఈ అక్షరాలు లిఖించిన వైఖరి నీకంటికి ఎట్లా కనపడుతోందో నిజంగా చెప్పు.

ఆనం—మరొకరి దస్తూరీ అనుకరించడానికి పట్టిపట్టి ఒక్కొక్క అక్షరమే రాసినట్టు కనిపిస్తోందిగాని, సజావుగా రాసినట్టు లేదు,

నవ—సరే, కూచో. (పంచాయితీ వారికి ఆ కాగితం చూపిస్తూ) తమరు ఓ త్తగించండి. ఇది కిరీటి దస్తూరీకి అనుకరణమే కాని, కిరీటి దస్తూరీకాదు. ఈ విషయం జ్యూరీ సభ్యులు గమనించాలని నా ప్రార్థన. పతాకం అనే విద్యార్థి,

కరటకం అనే నౌకరూ ఇచ్చిన సాక్ష్యాలు కేవలం వ్యర్థం. తాళం వేసి ఉన్నా హాలుగదిలోకి ఎవటిగోడ కిటికీల్లోంచి ప్రవేశించ వచ్చునని కరటకమే ఒప్పుగున్నాడు. ఊదాసిరా, పసుపుపచ్చటి జిగురుపీలికలూ గురించి భైరవం చెప్పిన సాక్ష్యం ఒప్పు గుంటాం. కిరీటీ దగ్గిర అటువంటి సిరా, అటువంటి జిగురు పీలికలూ ఉండడం, అతడి ఆంతర్య స్నేహితుల్లో ఒకణ్ణైన నాకే లోగడ తెలిసుండనప్పుడు, ప్రపంచంలో ఇంతమంది ఇతరు లుండగా, ఒక్క ఈ భైరవానికే ఆ విషయం తెలిసుండడంలో ఏదో రహస్యం ఇమిడి ఉండాలిగదా !

భై—(తలపక్కకి తిప్పి, తన సంగతి కానట్టు కనపడాలని యత్నిస్తాడు).

నవ—పరమరహస్యమైన యథార్థం ఒకటి ఉంది. అది నే నిప్పుడు చెప్పితీరాలి. ప్రధానోపాధ్యాయుడు దర్యాప్తుచేసి నప్పుడు, కిరీటి, ఎందుకు తబ్బిబ్బూ కంగారూ పడ్డాడో దాస్తో తెలుస్తుంది. ఒకసారి, నా సమక్షంలో, కిరీటి, గరుడాచలంగారి మీద తనకి వెర్రికోపం బయల్దేరగా, ఆయన్ని మాటలు మిగ లడం మొదలెట్టి, ఈ మాటలే అన్నాడు ! "గరుడాచలం ఒక ముండి పిశాచం"—అని. నాకు కిరీటి ఉపశిష్యుడు గనక, నేను తక్షణం అతణ్ణి మందలించి, అటువంటి అవాచ్యాలు పలకవద్దనీ అసలు అటువంటి ఆలోచనలుకుడా చెయ్యకూడదనీ తలవాచే చివాట్లు వేశాను. అటువంటప్పుడు, ఇంతకాంత జరిగిన తర వాత—అనగా, దుష్టవాచ్యాలేకాదు దుష్టాలోచన్లుకుడా వద్దు గాక వద్దు అని నేను శాసించిన తరవాత, మరీ విభంచెడి దుష్టలేఖనం

కుడా చేసి, నా మనస్సుకి నెప్పికలిగించే స్వభావం గలవాడు కాడే కిరీటి! యథార్థం ఏమిటంటే! అప్పటి మా సంభాషణ యావత్తూ విన్న వ్యక్తి ఒకడున్నాడు. వాడెవడో ఈపాటికి మీరు గ్రహించే ఉంటారు—భైరవం.

ఈ సందర్భంలో కొంచెం కొత్తసాక్ష్యం తెస్తున్నాను. ఈ కాగితం తణిఖీచెయ్యండి. దీన్ని దీపానికి అడ్డంగా ఇట్లా (అభినయిస్తూ) పట్టుగుంటే, వాత్తప్పుడు కనపడని అక్షరాలు గోచరిస్తాయి. అటువంటి గుప్తాక్షరాలు దీనిమీదివి చదివితే 'హాలండ్' అని ఉంది. అనగా, ఈకాగితం అక్కడి తయారీ. కిరీటిడెస్కు వెతికితే ఇల్లాంటిది ఒక్కటీ దొరకవనుకుంటాను. (కిరీటిడెస్కులోంచి రెండుమూడు అటువంటి కాగితాలు తీసి చదువుతూ) 'ఇంగ్లండ్' అని ఉంది, కోర్టువారు చిత్తగించండి. కాబట్టి తగాదాకాగితం కిరీటిది కానేకాదు. కిరీటి ఇటువంటి నీచపుపని చేసేరకం కాడని ఋజువుచెయ్యడానికి బోలెడుమంది ఇతర సాక్షుల్ని తీసుగురానూవచ్చుగాని, తీసుగురాను. నేరం చేసిన అసలువ్యక్తి ఎవడై ఉంటాడో అందరికీ తెలిసిపోయిందని నా నమ్మకం. ఒక న్యాయవిచారణ ఇప్పుడు ముగిసింది. మరొక న్యాయవిచారణ జరపాలని కోరుతున్నాం. ఎంజెయ్యం? కిరీటి యొక్క అమాయికత్వం స్థాపించడానికి మరోవ్యక్తి నేరకాడని నిర్ణయించవలిసిన అవసరం వచ్చింది. ఆ మరోవ్యక్తి నాకు చుక్కఎదురు. నాకేకాదు, ఆనందానికీ సంతానానికీ కుడా అతడు శత్రువే. అందుకని, మాలో ఎవరమూ అతడిమీద నేరారోపణ ప్రారంభించం. శంకారమూ అతడూ ఎన్నడూ కాట్లాడుకోలేదు

గనక, అవడిమీద జరపవలిసిన కాండ యావత్తూ శంకారం నిర్వహిస్తాడు.

(హర్షధ్వనులు. కిరీటివెళ్ళి నవరస్‌తో కరకంపనంచేసి, ఆతని పక్కని కూచుంటాడు)

శం—(లేచి) భైరవంమీద నేరారోపణ కేసు నేను ఉపక్ర మిస్తాను.

అవి—కానీ.

శం—కిరీటి తన డెస్కు ఇక్కడికి తేవడానికి ఒప్పుగున్నాడు గదా. నీ డెస్కు ఇక్కడికి తేవడానికి ఒప్పుగుంటావా, భైరవం?

భై—(లేచి, ఆగ్రహంతో) మీ ధోరణి యావత్తూ సు చోద్యంగా కనిపిస్తోంది. ఎవటివాడి మర్యాద తీసెయ్యడమే మీకు లక్ష్యం. నా డెస్కు ఇక్కడికి తీసుగురావడం నేను సుత రామూ ఒప్పుగోను.

శం—ఇదోటా! మాబాబే! అయితేకూచో, కరటకం, వెళ్ళి భైరవం డెస్కు ఇల్లాతే!

కరట—(ఎడమ ఎదరకి వెడతాడు).

భై—నా అనుమతిలేందే నా డెస్కు పట్రమ్మన్నారు. జాగర్త మీరంతా ఒకటోరకం లుచ్ఛాలని దేవునిఎదట ప్రమాణంచేసి చెప్పగలను. ఎల్లాగేనా ఏదో నేరం నా నెత్తిని రుద్దాలని దేవు ళ్ళాడుతున్నారు.

చి—రెండుమూడు రోజుల్నించి నేరం ఇంకోరి నెత్తిని రుద్దాలని నువ్వు దేవుళ్ళాడలేదూ? లోగడ నువ్వు చేసేసినపనే ఇప్పుడు మరొకరు చేస్తూండడం చూసి అంత కోప్పడతావేం?

కరట—(భైరవం డెస్కు తెచ్చి, ఉంచుతాడు).

రం—భైరవం! దీని తాళంచెవి ఇస్తావా ఒకసారి?

భై—పోయింది.

అవి—అయితే తాళం బద్దలుకొట్టండి.

రం—(డెస్కు తాళం బద్దలుకొట్టిన అభినయంచేసి, డెస్కు తీసి, డెస్కులోంచి ఒక్కొక్కకాగితమే లాగి, దీపానికి అడ్డుగా పట్టుగుని) 'హాలండ్, హాలండ్' (అని చదివి) తప్పుడురాత రాసిన కాగితం 'హాలండ్' లో తయారీ సరుకే.

భై—కల్పన ఎంతేనా చెయ్యచ్చు.

రం—ఊరుకో భైరవం. నీకు ప్రతికూలంగా ఇంకా బలవత్తరమైన సాక్ష్యం ఉంది. ఆట్టే తొందరపడకు మరి. కొంచెం నిదానించు. నవరస్! శేఖర్ని రమ్మంటావా?

నవ—ఆ. (అని, ఎడమ ఎవరకి వెడతాడు)

రం—శేఖర్కి ఒంట్లో సనిగాలేదు. ఈమధ్య లంఖణాలు. ఈవేళే కాస్త పథ్యం తిన్నాడు. తనకి తెలిసిన వయినాలు ఇక్కడికి వచ్చి చెప్పగలడేమో అని అడగడానికి ఇందాకా వెళ్ళి వచ్చాను. ముఖ్యంగా వస్తానన్నాడు.

నవ—(ఎడమ ఎదర్నించి శేఖర్ని తీసుగువస్తాడు).

రం—శేఖర్! రా. ఎల్లాఉంది! కొంచెం నయమేనా?

శే—ఆ.

రం—కరటకం, ఓకుర్చీతెచ్చివెయ్యి శేఖరానికి.

కరట—(ఓకుర్చీ తెచ్చివేస్తాడు)

శే—(కుర్చీలో కూచుంటాడు.)

శం—శేఖర్! నువ్వు శుక్రవారం జబ్బువాళ్ళ గదిలో ఉన్నావా?

శే—అవును.

శం—బోర్డున్న హాలుగదిలోకి ఓ కిటికీలోంచి ఎవరేనా ప్రవేశించడం నువ్వు గమనించావా?

భై—కోర్టువారు ఇటువంటి ప్రశ్నలు నిషేధించాలి. ఈ ప్రశ్నే సమాధానం ఫలానా అని చెబుతూంటుంది.

శే—మరి నోరు మూసుకో, భైరవం, తెలిసింది అంతా నేను చెప్పక మానను. అయ్యా! శుక్రవారం సాయంత్రం నేను రోగుల గదిలో కూచున్నాను. కిటికీలోంచి ఎగబాకి, ఈ భైరవం, బోర్డున్న హాలుగదిలోకి దిగాడు. కిటికీ మూసెయ్యడం మరిచిపోయాడు గాబోలు, తీసేఉంది. యాథాలాథంగా నేను చూస్తూనే ఉన్నాను. కిరీటి డెస్కు తెరిచి అందులోంచి ఏమిటో ఇతడు తీశాడు. దూరంమూలాన్ని, ఏమితీశాడో మాత్రం నేను గుర్తించలేక పోయాను. తరవాత, ఇతడు తనడెస్కు దగ్గిరికి వెళ్ళి పదినిమిషాలు నుంచుని ఏదో రాసినట్టున్నాడు. అక్కణ్ణించి, బోర్డుదగ్గిరికి వెళ్ళి కొంచెంసేపు నిలబడి, వచ్చి, కిటికీలోంచి దూకేసి అవతలపడి పరిగెట్టుకు పోయాడు.

శం—ఈ చర్య యావత్తూ నీకు ఆశ్చర్యకరంగా కనబడ లేదు మరి?

శే—లేదు. అప్పట్లో దాన్నిగురించి నేను ఏమీ అనుకోలేదు. కాని, ఇక్కడ ఏదో వాదోపవాదం జరుగుతోందని తెలిసిం తర వాత, ఇది ఏమిటా అని ఆలోచించాను, అరగంట కిందట

తంకారంతో ఇదంతా చెప్పేశాను. ఇది నలుగురికీ తెలియడం కుడా అవసరమేమో అని నాకు తోచింది.

తం—ఓపికపట్టు భైరవం. ఇహ ఆట్టేలేదు. (అని తన జేబులోంచి నలిపేసిన కాగితం ముక్కలు కొన్ని తీస్తూ) ఆనందం, ఇల్లారా!

ఆనం—సాక్షిస్థానంలో నుంచోనా?

తం—అక్కర్లేదు. ఈ కాగితం ముక్కలు నువ్వు ఎరుగుదువా?

ఆనం—ఓ. ఎరక్కేం?

తం—ఎట్లా ఎరుగుదువ్?

ఆనం—శనివారం పొద్దున్న విద్యార్థులు హాలుగదిలో పోగై, కొంతసేపటికి బయటికి పోయారు. నేను అల్లానే ఉండి పోయాను. ఓమూల,—కిరీటేమిటి ఆ నేరం చెయ్యడమేమిటి. అని ఆలోచిస్తూ! ఆ మట్టున, భైరవం డెస్కుపక్కని ఈ కాగితం ముక్కలు నా కంట పడ్డాయి. తక్షణం అవి పైకి తీసి, విప్పి, అమర్చి చూస్తిని గదా—'గరుడాచలం' అని రాసి కొట్టేసి, 'గరుడాచ' అని రాసికొట్టేసి. 'డా' అనే అక్షరం ఉద్దేశించిన వాటంలో సిద్ధించక పోవడంచేత ఆ అక్షరమే అయిదారు సార్లు రాసి అభ్యాసం చేసుగోడంలో పడ్డతంటాలు గోచరించాయి. ఏం భైరవం?

భై—ఊరుకో, మొండి పిశాచం!

తం—'మొండి' అనే మాటకుడా మూడుసార్లు రాసి కొట్టేసి ఉంది, 'డా' అనే అక్షరం గురించి లేఖకుడు ఎంత బాధపడ్డాడో

'డి' అనే అక్షరం గురించికుడా అంతబాధా పడ్డాడు. లేఖకుడు కిరీటివస్తూరీ అనుకరించబోయిన ద్రోహి.

భై—మరి ఇక ఆగవోయ్, పిశాచం, నేనే ఆ లేఖకుణ్ణి. అదంతా చేసింది నేనే.

(ఛీ, నువ్వా, నువ్వే. సిగ్గురేదురా, చావరాదురా, ఛీ, మొండీ! అనే కేకలు వినిపిస్తాయి.)

ఆరో—హోరి, నువ్వురా ఇంత గ్రంథమూ నడిపినవాడవ్! ఎంతమందిని బాధించావురా, మొండి పిశాచం! పుచ్చుగో, ఖర్చుకి! (అని, వెళ్ళి కొట్టబోతాడు.)

అవి—ఆగు, ఆరోగ్యం, ఇతడికి శిక్ష ఏమిటో నిర్ణయం అయేలోపల, ఇతణ్ణి ఏదో గదిలోపెట్టి తాళంవెయ్యండి.

చి—వీడు సంఘశిక్ష పొందవలసిన ఘటం,

అవి—అయితే విద్యార్థులంతా బారులుతీర్చి నుంచోండి. ఇతణ్ణి మధ్యగుండా వేంచెయ్య మనండి. మీ చేతిరుమాళ్ళు తీసి చివళ్ళని ముళ్ళెయ్యండి.

నవరస్—భైరవం మన సోదరుడే అని మరవకండి. (వాళ్లు రెండు బారులుగా నిలబడతారు. భైరవం బారుల సందున నడుస్తూండగా, అంతా తలో దెబ్బ వేస్తారు. అతడు వెనక్కీ ముందుకీ తరమబడి, వేగం ఎక్కువచేసి, ఓపక్కకి జరిగి, ఎడమ ఎదరికి నిష్క్రమిస్తూండగా, తెర.)

# నామాఁటే నెగ్గింది

[మోలియర్ రచనల్లో ఒకదానికి ఇది అనుసరణం. 27-1-1945 తేదీని రాజమంఁడ్రి ఆర్ట్సుకాలేజీలో శ్రీ తెన్నేటి సూర్యనారాయణ గారి అధ్యక్షత క్రింద జరిగిన పూర్వవిద్యార్థి వార్షికోత్సవ సమావేశం సందర్భంలో, అనుమతితో ఇది మొదటిసారి ప్రదర్శించారు.]

## పాత్రలు

శఠకోపం—సలిలానికి నచ్చని పెళ్ళికొడుకు

అభిషేకం.—సలిలం తండ్రి, గృహస్థు

నవనీతం—సలిలానికి నచ్చినవాడు.

మాలోకం } మాయలు తెలిసిననౌకర్లు
తలుపులు }

డాక్టరు సంతానం } నాటువైద్యులు
డాక్టరు సముద్రం }

సలిలం—అభిషేకం కూతురు

## పాత్రధారులు

శఠకోపం— శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు

అభిషేకం— ,, యం. వెంకటరావు

నవనీతం — ,, టి. జగన్నాధరావు

మాలోకం— ,, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు

తలుపులు — ,, సిహెచ్. సుబ్బారావు

డా॥సంతానం— ,, బి. వి. సూర్యనారాయణమూర్తి

డా॥సముద్రం—,, కె. రామకృష్ణరావు

సలిలం— ,, ఎ. వి. రమణరావు

# రంగం-1

[తెర (1). తెర (2) లేస్తాయి. ఒక ఇంటి వీధిగది. ఇల్లు ఎడమవైపు ఉన్నట్టు. రెండు కుర్చీలుంటాయి. కుడి ఎదర నుంచి సలిలం వచ్చి, ఎడమకేసి నడిచి, ఇల్లు గుర్తు పట్టినట్టు నటిస్తూ]

స—నవనీతంగారూ వాళ్ళూ నాటకం తయారు చెయ్యడానికై అభ్యసించే నిమిత్తం తీసుకున్న కొట్టు ఇదే. పిలిచిచూస్తాను. అయ్యా, పంతులుగారూ!

న—(ఎడమ మధ్యనించివచ్చి) ఇదిగో, సలిలం! రా కూచో!

స—(కుర్చీమీద కూచుంటుంది)

న—ఊఁ, ఎల్లా తెలిసింది మేం రిహార్సలు కోసం పుచ్చుగున్న ఈ బసా?

స—సరే. నోట్లో నాలికుంటే బసే తెలియదూ!

న—జాగ్రత్తగా వచ్చావా, మీనాన్నగారు పసికట్టకుండా?

స—ఆ వీలైనంత గుట్టుగానే వచ్చాను కాని (కుడి ఎదర చూస్తూ) నన్నెవరూ వెంటాడలేదు కదా అని భయం వేస్తోంది.

న—(అటు పరకాయించి) ఎవరూ లేరే?

స—లేరు కాని, మానాన్న ఈదార్ని వస్తారేమో!

న—అదా నీ భయం! (అని ఎడమ ఎదరికె తిరిగి) ఒరేయ్, తలుపుయా!

త—(ఎడమ ఎదర్నించి వస్తూ) చిత్తం!

న—ఒరేయ్! (అని కుడి ఎదర సూచిస్తూ) నువ్వు వీధి గుమ్మంలో నుంచుని, వీధంట మునలిఘటాలు ఎవరేనా వస్తూంటే చెప్పు.

త—చిత్తం (అని, కుడి ఎదరికి పోతాడు)

న—సలిలం! మీనాన్న నీ నిమిత్తం ఏర్పాటు చేసిన పెళ్ళికొడుకు ఈఊళ్ళో దిగేది ఈవేళే-ఇప్పుడే, ఇంక రిహర్సలేమిటీ, మనం గజ్జికట్టి అసలు ఆటే ఆడేసెయ్యాలి.

స—ఆడచ్చుగాని, మనం నెగ్గుతామా?

న—ఓ చెప్పిమరీ నెగ్గుతాం. పెళ్ళాళతో వస్తూన్న ఆ జంతువుని ఈ ఊర్నించి తరిమేసేస్తాం.

స—ఏమో! అంతపనీ జరిగింతరవాత అనుకోవాలి.

న—జరిగి తీరుతుందిగాని, మీనాన్నకి ఆ సంబంధం అంటే అంత మక్కువ ఎల్లాకలిగిందో!

స—ఏమో!

న—వాడికి నాకంటె రాబడి ఎక్కువనా?

స—అయితేమాత్రం?

న—అతణ్ణి మీనాన్న చూశాడా, అసలూ?

స—లేదుట, విన్నాట్ట!

న—మీనాన్న ఊహ వాడికి శాస్త్రం తెలుసుననా?

స—అబ్బో! అతని సంగతి చాలాసరదు కనుక్కున్నారే అప్పుడేనూ!

న—కనుక్కోనుమరీ! అతనిపేరే పడగొడుతుంది ఎంతమందినైనా—'శఠకోపం'

స....(నవ్వుతూ) మరేమరే 'శఠకోపం':

న—ఇంటిపేరు—"కిటికోటి"—విన్నావా! వాళ్ళది పిల్లి సీమ! నిన్ను శఠకోప — సతి గా చెయ్యాలని మీ నాన్న సంకల్పం.

స—ఎమో గీటు ఎల్లా ఉందో! మీరు ఏవో మాయలు పన్నుతాం అన్నారుగదా అనే ధైర్యంతో ఉన్నాను.

న—పన్నుదాం అనడమే కాదు. పన్నేశాం. మావ్యూహాలు చివరదాకా సిద్ధంగా ఉన్నాయి, ఆరంభించడమే తడువు.

స—ఏమిటవీ?

న—అవేమిటని నువ్వు నన్ను అడగాకూడదు, నేను చెప్పా కూడదు. చూస్తూండూ తమాషా! జరగబోయే అద్భుతాల గురించి ముందే మనకి తెలిసిపోతే. మనకి కలిగే ఆనందం పల్చబడి పోతుంది. మనకి మాలోకం ఉన్నాడు, తలుపు లున్నాడు. మాలోకం మాంచి ఇంద్రజాలి. తలుపులు కూడా మాంచి వేషధారి.

త—(కుడి ఎదర్నించి వస్తూ నవనీతంతో) మరండీ, వీరి నాన్నగారూ....

స—(దాక్కోడానికి యత్నిస్తూ ఎడమకేసి నడుస్తూ) నే నెక్కడ దాక్కోనూ?

త—మరండీ, వీరినాన్నగారండీ, రావటం....లేదండి.

న—చూశావా, సలిలం, నువ్వెంత కంగారు పడిపోతు న్నావో, వార్త్తి పుణ్యానికి!

స—మానాన్న వచ్చేస్తున్నారనుకున్నాను.

న—ఆయన రావడం యథార్థమే కావచ్చు. అయినాసరే, నువ్వేదో తస్సావేసేసి నిబ్బరంగా ఉంటూండాలిగాని, బయట పడిపోకూడదు.

స—ఏం తస్సావెయ్యనూ ?

న—ఎదో ఓటీ! మీ నాన్న వస్తూన్నా ఆయన్ని చూడనట్లు నటించి, మా కేసే తిరిగి ఉండి, కళ్ళ నీళ్లు పెట్టుగుంటూ, మా నాన్నగారు ఇల్లా వచ్చారాండీ!" అంటూ దీనంగా అడుగు తూండడమో ఎదోచెయ్యాలి. అంతేగాని. పట్టుబడిపోకూడదు. అందుకనే, నీకు మా ఎత్తులూ గొడవలూ తెలియక పోడమే మంచిది, పోనిస్తూ;

త—మరండీ !....వీరి నాన్నగారు కాదండి వస్తూంటా, మాలోకం అండి.

మా—(కుడి ఎదిర్నించి వస్తాడు)

న—ఇడుగో, మాలోకం ! రా, రా ! ఏమిటయాడు మన పిల్లిసీమ పెళ్ళికొడుకు ? కనపడ్డాడా, మన శఠకోపన్నాథుడు ?

మా—ఆ. ఇక కాస్సేపట్లో ఈ ఊళ్ళో దిగుతాడు. పక్క-మజిలీ ఊళ్ళో వాణ్ణి కలిశాను, చూశాను. భోజనంవేళ మనిషిని బాగా ఆరా తీశాను. వాడి రూపం ఉందండి, ఆహాహా, ఏమిరూపం, ఏమిరూపం! నే చెప్పడంఎందుకూ, కాస్సేపట్లో మీరే అనుభవిస్తురు గాని ఆ సహజ సౌష్ఠవం! ఇక వాడివేషం ఉందే, వాడి రూపానికి సమాన ఉజ్జీలో ఉందిగాని తీసిపోయేట్టులేదు. ఈ రూపవేషాలకి తోడు వాడిబుద్ధి ఉందండీ బాబూ—అంత మందబుద్ధిని మనం వెతిగినా పట్టుగోలేం. మన బోనులోపడడానికి వాడు

సరియైన జంతువు. మనం పన్నిన పన్నాగాల్లో వరసాగ్గా చిక్క డానికి అర్హుడు ఎవడూ అంటే వాడేనండి !

స—ఇంకేం, మన ఎత్తులన్నీ వాడిమీద చెల్లుతా యన్న మాటే !

మా—చెల్లితీరతాయండి. నేను మనుష్యుల్ని కాచి వడబోశా నండి, బాబూ !

స—రూఢేనా అని !

త—రూఢేనండమ్మా. ఈ మాలోకం ప్రజ్ఞ మామూలురకం కాదండి. ఇష్టుల్ని రక్షించడం గురించి సాహస కృత్యాలు చేసి ఇతను ఎన్నిసార్లు ఖైదులో పడ్డాడో మీ రెరగరు. విజయం సాధించడానికి ఇతనే ఉండాలి. ఈరకం అద్భుతాలు జరిపిన వాళ్ళల్లో ఇతను యుగధీరుడు.

మా—ఆగాగు. నీస్తోత్రాలు వినేసరికి నాకు సిగ్గవుతోంది. నీమాట చెప్పవేం ? నువ్వుమట్టుకు సామాన్యుడివా ? మారు వేషాల్తో వెళ్ళి ఎంతమంది ఎరగని వాళ్ళకి ఉరివెయించావు ? ఎంతమంది అమాయికుల సొమ్ములు లాగేశావు ?

త—ఆ, నీ దగ్గిర నే నెంతా ?

న—అందుకనే, మాకు మీయిద్దరి సాయమూ ఉంది గనుక విజయం రూఢి.

మా—సరేలెండి. కాని, అయ్యా, ఇక మనవాడు వచ్చే స్తాడు. మొదట, నేను వెళ్ళి అతణ్ణి కలుస్తాను. తరవాత జరప వలసిన నాటకం మళ్ళీ ఒకసారి, సూక్ష్మంగా, మన్లో మనం అనుకుందాం పట్టండి. (1)—నేను అతణ్ణి కలవడం,

స—(2)—నే నద్దణ్ణి కలవడం. (3)—డాక్టరు దర్శనం.

మా—ఈవ్యూహం సంగతి డాక్టరికి తెలియకూడదు, కాదండీ!

స—తెలియకూడదు. తరవాత....

(4) మాడాక్టరుగార్ని అభిషేకంగా రింటికి పంపడం. అక్కడికే ఈ జమాల్‌ఖాన్ వెడతాడు (అని తలుపుల్ని చూపెడతాడు)

స—నాకేమీ బోధపడటంలేదు.

స—ఈ క్షోభంతా నీకు అనవసరం అని చెప్పానుగా సలిలం! నువ్వల్లా అభినయించవలిసింది ఏమిటంటే....ఏమిటి చెప్పు.

స—మానాన్న ఏదిచెబితే అది చాలా బాగుంది అనడం, ఆయన సంకల్ప ప్రకారం నేను నడుచుకోడానికి నాకు చాలా ఇష్టంగా ఉన్నట్లు నేను కనపడడం, శరకోపాన్ని తప్ప మరొకర్ని పెళ్ళాడనని బిగిసి కూచోడం.

మా—అంతేనండి మీవంతు. తరువాత (5)—ఇద్దరు ఆడవాళ్ళుండాలి, అయిదారుగురు పిల్లలు....

స—అవునవును. ఆ ఆడవాళ్ళకి చెరో రూపాయీ ఇయ్యి! పిల్లలకి ఏదేనా కొనిపెట్టు. ఇదుగో (అని డబ్బుఇస్తాడు) వాళ్ళు ఏమేమి అనాలో కాగితాలమీద రాశాను (వెతిగితీసి కాగితాలు ఇస్తూ) ఇది ఒక ఆడదానిపార్టు, ఇది రెండోదానిపార్టు. ఇది కుర్రాళ్ల కేకలెయ్యవలసిన మాటలున్నది.

మా—సరి మరి (6)—శరకోపానికి ఆడవేషం, ఈ పోలీసు ఉద్యోగి (అని తలుపుల్ని చూపెడతాడు)

శ—మళ్ళీ నేనే కాకుండా మరోరయితే బాగుంటుందేమో!

మా—ఆఁ, నువ్ కాకపోతే, మనఎత్తులు ఇంకా ఎంత మందికి చెప్పడం! చివరకి మీరే వీర్ని (సలిలాన్ని చూపిస్తూ) పారిపోతూంటే పట్టుగున్నట్టు....

న—అవును....సరేకాని, మొట్టమొదట అతడు ఊళ్ళో దిగగానే, అతణ్ణి ఏడిపించడాంకి పది పదిహేనుమంది ఉండాలి గదా?

మా—నేను ఇప్పుడు ఆ ఏర్పాటు చేసే వచ్చాను. ఓ యిరవై మంది దిప్పకాయి రాలుగాయి జనానికి నేను బాగా కాఫీపొయించి, వాళ్ళని బళ్ళస్టాండు దగ్గిరపెట్టివచ్చాను. బండిలోవచ్చి అచ్చంగా జంతువులాంటి వాడొకడు దిగుతాడు, వాణ్ణిబాగా ఏడిపించండని వాళ్ళతో చెప్పాను.

న—సరే, మనం ఇక పోదాం. సలిలం! జాగర్త. నువ్వింక వెళ్ళు. నిన్ను మేం వెంటనే కలుసుగోడానికి వీలుకుడాలేదు. నీ పాఠం నీకు జ్ఞాపకం ఉందా!

స—ఆ! నా పాఠం కాస్తేగా?

న—కథానాయకురాలు అల్లా అనడం ధర్మమా!

మా—(కుడిమధ్యకి జరిగి వినడం నటించి) అడుగో! శర కోపం ఊళ్ళోదిగాడు. వాణ్ణి నేపెట్టిన జనం గోలచెయ్యడం మొదలెట్టారు. పదండి. ప్రారంభం నాతోనేగా!

(కుడిమూలకి సలిలం వెడుతుంది. ఎడమమధ్యకి నవనీతం, మాలోకం, తలుపులూ వెడతారు తెరపడుతుంది. లోపల మాలోకం ఘరానా వేషం వేసుగుంటాడు,)

---



## రంగం - 2

[కుడి ఎదరచించి తనని వెంటాడించే మూకని మందలించ డాని కన్నట్టు వెనక్కి తిరుగుతూ తొందరగా, బెదురుతూ శర కోపం ప్రవేశిస్తాడు]

శ—వెళ్లండోయ్! దిక్కుమాలి గడేకారి సజ్జు! నాలో ఏముందనిరా, ఇల్లా. నా వెంటపడి ఏడుస్తున్నారూ! భడవా ఊరులా ఉందే. ఇదీ,—భడవా ఊరూ భడవా జనమూనూ! వీళ్ళు చచ్చిపోనూ! ఎటునడుద్దాం అన్నా ఈ ఊళ్ళోగాడిదలే. వందలు వందలు మందలు .మందలు—చెవులునిక్కపొడుచుగుని, కళ్ళు తేలేసి, ఏకఓంగ్రపెట్టడం, వీళ్ళ ఓంగ్రడింపు సన్నగిల్లా! ఓరి దద్దమ్మల్లారా, మీకు పనంటూ ఏమన్నా ఉంటే చూసుగోండిగాని, చుట్టుపక్కలవాళ్ళకి నవ్వుకలిపిస్తూ కూచోకండిరా చెవలాయి ల్లారా! నవ్వు ప్రారంభించిన వాడి పళ్ళు గవ్వల్లాగ రాలకొ డతా, రాలగొట్టి లెఖ్ఖెట్టిస్తా, లెఖ్ఖెట్టించి అమ్మిస్తా!

మా—(ఎడమ ఎదర్నించివస్తూ) ఆజనాన్నే మందలించ డానికి వచ్చినట్టు నటిస్తూ) ఏమిటయ్యా మీరు చేస్తూన్నదీ ఇదేనా వరస! మీకు ఏమిటీకావాలీ? పరాయివాళ్ళని ఇంతగా ఏడిపిం చడం ధర్మమేనా?

శ—(మాలోకాన్ని ఆప్యాయంగాచూస్తూ) అమ్మ! బుద్ధిగల వాడు ఒకడు కనిపించాడు ఈవూళ్ళో!

మా—(వాళ్లకేనేతిరిగి ఉంది) మర్యాదా అఖ్ఖర్లే? నవ్వ డానికి కారణం అంటూ ఉండాలా?

శ—మరే అల్లాగడ్డెట్టు కుంకలకి.

మా—(వాళ్ళతో లాగ) ఈమహానుభావుడి స్థితిగతుల్లో అంతగా నవ్వతగ్గ వికారం ఏమన్నా ఉందా ?

శ—(కోపంగా వాళ్ళవేపు ఒకఅంగవేస్తూ) అని అడుగుతా!

మా—(వాళ్ళతోలాగ) ఈయన కడం వాళ్ళకి మల్లేలేడా ?

శ—నాకేమన్నా అవిటా, గూనా ?

మా—(వాళ్ళతోలాగ) ఎదటిమనిషి ఎవరో కాస్త గమనించి మరీ ఇదవండి.

శ—మా బాగా అన్నావు.

మా—(వాళ్ళతో లాగ) ఈయన గొప్పలక్షణాల్ని మన భుజాల మీదా ఈయన్ని మన నెత్తిమీదా ధరించాలి, మనం అంతా !

శ—అక్షరాలా నిజం.

మా—(వాళ్ళతో లాగ) ఈయన తరహా గొప్పది.

శ—అందులోనూ నేను పిల్లిసీమప్రాంతం పురుషుణ్ణి.

మా—(వాళ్ళతోలాగ) వీరు ఎంతో సూక్ష్మబుద్ధి.

శ—నిస్సంశయంగా, న్యాయశాస్త్రంలో పుట్టు పండితుణ్ణి.

మా—(వాళ్లతోలాగ) ఇల్లాంటివాడు ఈపూరు రావడ మనేదే గౌరవం ఈపూరికి.

శ—ముమ్మాటికీనిజం.

మా—(వాళ్ళతోలాగ) ఈ మహాజనుడిదగ్గిర హాస్యాస్పద మైన సందర్భం కించిత్తూలేదు.

శ—మందులోకైనా లేదు.

మా—(వాళ్ళతోలాగ) అందువల్ల. (కొంచెం కోపంగా) మీలో మొదట నవ్వేఘాతిమెవడికి చెందుతుందో ఆ ఘాతి గలవాడికి సవ్వారీ కట్టించేస్తాను. ఈపాటి రోష్టుచ్చుగోండి.

శ—(మాలోకంతో) అయ్యా! మీకు నేను చాలా ఋణస్థుణ్ణి.

మా—అయ్యా! మీ అంతవారికి. ఇటువంటి ఒకరాయి స్వాగతం అయిపోయిందే అని దుఃఖిస్తున్నాను.

శ—దానికేంచెండి, నేను తమ సేవకుణ్ణి.

మా—తమరు కొంచరితోకలిసి ఉపయాన్ని చల్లి ఆరగించడం నేను ఈ వేళ గమనించాను. ఆ చల్లి భుజించడంలో మీరుగారు కనపరచిన విలాసం ఉందే, దాంతో మీ మీద నాకు ఎక్కడలేని స్నేహమూ పుట్టుకొచ్చింది, ఈ వూరు మీకు కొత్తగనక మిమ్మల్ని కలుసుగుని నే చెయ్యగలసేవ తమకి చేస్తానని మనవి చేసుగోవాలనే సంబరంతో వచ్చి పడ్డాను. కొత్తవాళ్ళని ఆదరించడం ఎరగనే మెరగరండి. ఈ ఊరుజనం!

శ—మీరు నిజంగా చాలాదయ.

మా—ఇందాకానే అన్నానుగదండీ!....మిమ్మల్ని చూసిన తక్షణం నామనస్సు మీమైపు వొరిగింది.

శ—భాగ్యం. మీకు ఎంతో విధేయుణ్ణి.

మా—మీ ముఖవైఖరి నన్ను సంతోషపరిచింది.

శ—(ఆనందిస్తూ) నన్ను మీరు ఎంతో గౌరవిస్తున్నారు.

మా—మీ ముఖంలో నిజాయితీ అనేది ప్రతిఫలిస్తోంది.

శ—ఏమిటో! తమకు నాభర్ని (అని సిగ్గు నటిస్తాడు)

మా—మీ ముఖం ప్రేమార్ద్రమై.........

శ—ఆఁ.........

మా—విలాసంగా

శ—అల్లానే మరీ!

మా—మధురంగా

శ—అవును!

మా—రాజఠీవిలో

శ—ఓహో!

మా—అమాయికంగా

శ—అక్షరాలా!

మా—ఆకర్షణీయంగా

శ—అద్దమా!

మా—ఉంది.

శ—ఉంది. సందేహమా!

మా—నేను మీవాణ్ణి.

శ—నేను మీ విధేయుణ్ణి.

మా—నేను నా హృదయ గర్భాన్నించి చెబుతున్నాను.

శ—నేను నమ్మకమానను.

మా—మీ పరిచయంనాకు కలిగితే, నా త్రికరణశుద్ధి మీకే తెలుస్తుంది.

శ—ఆ సంశయమే లేదు నాకు.

మా—నమ్మించి దగాచెయ్యడం మా యింటావంటా లేదు.

శ—అని, నా నమ్మకం!

మా—ఉద్దేశాలు దాచేసుగోడం నాకు చేతేకాదు.

శ—నా ఉద్దేశం అచ్చంగా అంతే.

మా—నా వేషంబట్టి నామనశ్శుద్ధి పోల్చుగోవచ్చు, మీరు.

శ—అందుకనే, నేను ఏకంగా సఫావేషం వేసేశాను.

మా—మంచిపని చేశారు. ఈవేషం మీకు తగ్గట్టు మరోడికి తగదు.

శ—దుస్తులు కుట్టినవాడూ అల్లానే అన్నాడుస్మండి. ఇది మంచి ఖరీదుగలవేషం. దీంతో జనం డంగైపోతారు.

మా—జనం పట్టికొట్టేస్తారు. మీరు బస చూసుగున్నారా?

శ—చూడాలి.

మా—ఈపక్కనే ఒక వసతి ఉంది. ఖాళీలున్నాయేమో కనుక్కొస్తానుండండి. (అని ఎడమ ఎదరకి వెళ్ళదోయి మళ్ళీ ఆగుతాడు.)

[కుడి మధ్యనించి నవనీతం వస్తాడు]

న—(వస్తూ, చాలా పరిచితుడుతోలాగ) ఓహోహో! ఇదిగో! ఏమిటేమిటీ: ఎప్పుడూ రావడాలూ! ఎన్నాళ్ళకి శఠకోపంగారి దర్శనం అయిందీ! చాలా సంతోషం! అదేమి టండోయ్, నన్ను మరిచే పోయినట్టు అల్లాచూస్తున్నారేం?

శ—చిత్తం చిత్తం

న—అయిదారేళ్ళలోనే కుటుంబ స్నేహితుణ్ణే మరిచి పోయారే, ఆశ్చర్యం!

శ—అవునవును. (మాలోకంతో) వీణ్ణి నే నెరుగుంటే నన్ను చంపుగున్నంత ఒట్టు!

న—మీ కిటికోటి కుటుంబంలో చంటిపిల్లల లగాయతు చచ్చి పోయిన ముసలమ్మలదాకా నేను ఎరుగుదును. వెనక నేను మీ పూరు మకాంలో ఉన్నప్పుడు రోజూ మిమ్మల్ని దర్శించేవాణ్ణి.

శ—నా మీద గౌరవం మీకు అల్లా ఉంది.

న—సరే. మీకు నా ముఖమే జ్ఞాపకం లేదూ?

శ—(ముఖంకేసి నిదానించి) మరే మరే. (మాలోకంలో) వీణ్ని ఎంతమాత్రం చూశ్చేదు.

న—అబ్బ! మనం ఎన్నిమాట్లు కలిసి తాగామండీ అదీ ఇవీనూ!

శ—నిజమే, క్షమించాలి. (మాలోకంలో) నాకు ఆ సంగతి ఏమీ తెలియదు.

న—అయితే చూడండీ, ఆ వంటలవా డుండేవాడే, వాడి పేరేమిటి చెప్మా....(అని, జ్ఞాపకం చేసుగుంటూన్నట్టు నటిస్తూ) ....నాంకచివర లకుతోంచండీ....స్వర్గతుల్యంగా వండేవాడండీ!

శ—మల్లాయి.

న—హాదుగో, వాడూ! మల్లాయి. మరే మరే మల్లాయే. వాడు సరి, అక్కణ్ణించి రోజూ జనం షికారు వెళుతూండే చోటుంది, మంచిదీ....

శ—నల్లప్ప సమాధి.

న—మరేమరే నల్లప్ప సమాధి! అక్కడ హాయిగా మనం ఎన్నేసి గంటలపాటు ఎలాంటి సంభాషణలు జరిపాం! జ్ఞాపకం పెట్టండీ!

శ—(చిరునవ్వుతో) అక్కడా, అవునండోయ్, (మాలోకంతో) అల్లాంటి దేదీ నాకు ఛస్తే జ్ఞాపకం రావటంలేదు.

మా—(శకకోపంతో రహస్యంగా) బాగా జ్ఞాపకం చేసుగోండి పోనీ, తీరా ఇతను గొప్పవాడేమో!

న—(శతకోపంతో కరకంపనం చెయ్యబోతూ) అసలు పూర్వస్నేహంలాంటి వస్తువు ఉందిటండీ! .

మా—(శతకోపంతో రహస్యంగా) మీరంటే ఆయనకి బహు ఆప్యాయంగా ఉందే?

న—(కరకంపనచేసి) మీవా దొకాయన గొప్ప....

శ—మరే, మా అన్న. మేజస్ట్రేటు.

న—అప్పుడప్పుడు. ఆయనే, క్షేమమా?

శ—ఏదో మీదయ యథాశక్తిగా క్షేమంగా ఉన్నాడు.

న—చాలా సంతోషం. తరవాత....మీ బంధువుడే ఒక మహా సాత్వికు డుండాలే! మీ....మీ—

శ—అతనా, మా పింతాత పనమడు-ధరల కంట్రోల్ అధికారి.

న—(దీర్ఘంగా) ఆఁ—ఆయన?

శ—వాడికేం? వాడి కంతా డబ్బే. బహు క్షేమంగా ఉన్నాడు.

న—చాలా ఆనందం. మీమ్మామ కుశలమా?

శ—నాకు మొదణ్ణించీ లేడు.

న—అహఁ. వెనక ఉండాలి కాబ్టండీ!

శ—అబ్బే, ఒక మేనత్త.

న—అల్లా చెప్పండి మరీ? ఆవిడే శ్రీమతి....ఆవి డెల్లా ఉంది?

శ—ఆర్నెల్లయింది.

న—పాపం, నే విన్లేదుసుమండి. అయితేం, ధన్యురా ల్లెండి. మహా దొడ్డఇల్లాలు. ఆవిడికి పిల్లలున్నట్టు జ్ఞాపకం!

శ—ఒకడున్నాడు. వాడు మఠాధికారి. కాని, ఈ మధ్య మా మేనల్లుడికి మసీసగం పోసి మరణం అంతపని జరిగింది.

న—అంతపనీ జరిగింది కాదు, మీకు మహచిక్కయేది!

శ—మీరు వాణ్ణి ఎరుగుదురా ఏమిటి?

న—అయ్యో! చాలా దోస్తీగా ఎరుగుదునండి—అందంగా పొడుగ్గా ఉంటాడూ!

శ—అంత మరీ పొడగరి కాడు.

న—కాకపోతే లెఖ్ఖమిటి లెండి, బహు అందకాడు.

శ—మరే.

న—అతడు మీకు స్వయానా మేనల్లుడై ఉండాలి.

శ—మరే.

న—మీసోదరికి పుత్రుడు.

శ—మరే.

న—అరడు వెనక నిక్షేపంలా ఉంటోచ్చినట్టు జ్ఞాపకం!

శ—మరే. (మాలోకంతో) ఈయన నా బంధువులందర్నీ ఎరుగునయ్యా!

మా—మీరు అనుకున్నకంటే కూడా ఎక్కువగా ఎరుగు న్నటున్నాడు.

శ—(నవనీంతతో) తమరు మావూళ్ళో మకాం దీర్ఘంగానే వేసుంటారు.

న—రెండు నిండు సంవత్సరాలపాటు వేశాను.

శ—అబ్బో. అల్లానా! అయితే మా పింతాతగారి మనమడి కొడుకు భారసాల ఎరుగుదురన్నమాటే!

న—భేషుగ్గా. మొదటి ఆహ్వానం నాకే పంపించారు?

శ—ఆ భారసాల మహా ఒకటోరకంగా జరగలేదూ.

న—చాలా.

శ—భోజనాల ఏర్పాటు బహు ఎక్కాగా ఉంది.

న—అద్భుతంగా ఉంది.

శ—అయితే మీకా దెబ్బలాట జ్ఞాపకం ఉందన్నమాటే—నాకూవాడికీ....ఆసనవయ్య ఎవడోవచ్చాడే పీతలూరువాడు—వాడికీ నాకూ జరిగిన దెబ్బలాట.

న—ఆ ఆ స్పష్టంగా కళ్ళకి కట్టినట్టు ఉంది.

శ—వాడికి తగ్గ ఉర్జీగా నిల్చానా లేదా నేను?

న—వాడు మీకు బలాదూరై పోయాడు.

శ—కాని, మీకు జ్ఞాపకం ఉందో లేదో, (ఉడుకుమోతుతనం నటిస్తూ) ఆకుంక నన్ను చాటంత చెంపకాయ కొట్టాడుస్మండి. (మళ్ళీ ఉత్సాహంగా) నేనూ వెంటనే వాడికి ముట్ట చెప్పేశానండి అట్టేపెట్టకుండా।

న—అవునవును. అప్పట్లోమేం అడ్డుకోకపోతేవాణ్ణి చంపేసి పోగు లెట్టేసేవారే! కాని ప్రస్తుతం ఒఖ్ఖమనవి, నా యింట్లో తప్ప మీరు మరోచోట బసచేస్తే నేను ఎంత మాత్రం ఒప్పను.

శ—నేనూ....

న—నేనూలేదు నానూలేదు. పరమస్నేహితుల్లో ఒక రెళ్ళి పరాయిచోటుబస చేస్తూంటే చూస్తూ ఊరుకోడ మెల్లాగండీ!

శ—ఒకవేళమీకు కొంచెం ఇబ్బంది........

న—ఈదిక్కుమాలి ఇబ్బందులు ఎప్పుడూ ఉన్నవేపోదురూ! నాయింటే తమరి బస. రెండోమాట నోటంట రానీకండి.

మా—(శంకోపంతో రహస్యంగా) అతడంత పట్టుపట్టేటప్పుడు పోనీ మాభాగే అనండి.

శ—పోనీ మీతో వత్తాం అంచే నా సామాను.

నా—మీ సామాను ఎదీ?

శ—బళ్ళు దిగేచోటఉంది. నౌఖర్ని అక్కడ పెట్టి సామాను చూస్తూండమన్నాను.

స—ఎవర్నైనాపంపి తెప్పించండి.

శ—ఎల్లా? మోసగాళ్ళుంటారు, అక్కణ్ణుంచి నేవచ్చే వరకూ కదలద్దని వాడితో చెప్పొచ్చాను.

మా—మంచి బాగా కట్టుదిట్టం చేశారన్నమాట.

శ—ఈపూళ్ళో పీలైనంత జాగ్రత్తమీద ఉండటమే నయమని నాకు ముందేతెలుసు (నవనీతంతో) మీరుకూడా నాతోరండి, వెళ్ళి సామాను తీసుకుని మీయింటికి పోదాం.

న—అవశ్యం వస్తా. కానండీ, నేను ముందెళ్ళి మీ నిమిత్తం కొన్ని సదుపాయాలు చేయ.చాలని చూస్తున్నాను.

శ—అయితే మీబస ఎక్కడో చెప్పి పొండి. పీరూ నేనూ వెళ్ళి సామాను పట్టించుకొస్తాం.

న—(మాలోకంతో)-(నడిమధ్యకేసి చూస్తూ) అదుగో. ఆ కనపడే పెద్దభవనానికి వీరినీ సామాన్నీ తీసుకురండి. అది నా ఆంతర్యస్నేహితుడిఇల్లు. అక్కడసేద తీర్చుకుని క్రమేపీ మా యింటికి పోదాం. (అని నడిమధ్యకి పోతాడు)

శ—(కులుకుతూ మాలోకంతో) చూశారా! చోటు పరాయి చోటు అయినా యోగం ఉండబట్టి మీ లాంటి నిష్కారణ పరి

చయుడూ ఆయనలాంటి పూర్వస్నేహితుడూ నిమిషంలో నాకు దొరికారు.

మా—నిజమేనండి. మీది చాలా గొప్పయోగం. లేకపోతే వివాహం కలిసిరాదు. మీకు శ్రమ ఎందుకు, నే వెళ్ళి తెస్తునా మీ సామాను?

శ—మానౌఖరు అది త్రినేత్రుడికైనా ఇవ్వడు. అది వాణ్ణే త్తినే పెట్టి వాణ్ణి మీవెంట రమ్మనండి.

మా—(కుడిమధ్య చూపిస్తూ) నడవండి, మిమ్మల్ని ఆ భవనం దగ్గిర జేర్చి నేను బళ్ళ దగ్గిరికి వెడతాను.

(అని కుడిమధ్యకి నడుస్తాడు. అతని వెనకాలదర్జాగా శఠకోపం వెడతాడు. తెర)

---

## రంగం - 3

[కుడిప్రక్క కొన్ని సీట్లు ఉంటాయి. ఎడమ మధ్యనించి ముందు నవనీతమూ, వెనకాలే శఠకోపమూ వస్తారు]

న—(ఖాళిసీట్లకేసి చూసి) సరి. మా స్నేహితుడు లేనట్టు న్నాడు. మాయింటికే పోదాం రండి ఏకంగానూ! (అని తిరిగి వెనక్కి వెళ్ళబోతూ) పోనీ, ఓపని చెయ్యండి. మీరు ఒక్క క్షణం పాటు బయటికి వెళ్ళి నిలబడండి. నేను లోపలికెళ్ళి వారబు చేసివస్తాను.

శ—త్వరగా రండి (అని ఎడమ మధ్యకి నిష్క్రమిస్తాడు)

న—(కుడి మధ్యకి నడిచి) ఏమండోయ్, డాక్టర్ గారూ, డాక్టర్ గారూ!

[డాక్టర్ సంతానం కుడిమధ్యనించి వస్తాడు]

న—నమస్కారం, డాక్టర్ సంతానంగారు!

సం—నమస్కారం. దయచెయ్యండి.

(ఇద్దరూ కూచుంటారు)

న—మొన్న తమతో మాట్లాడానండీ.

సం—అవునవును. మీకు బిల్లు పంపించరే?

న—నేనేమీ మందు పుచ్చుగో లేదండి.

సం—అల్లానా!....మీ పేరు?

న—నా పేరు నవనీతం.

సం—ఓహో!

న—ఈమధ్యస్తమకి కబురుపంపించానండి.

సం—ఓస్ అదా! ఎవరో మీ బంధువుడికి మతిపోయిం దనేనా!

న—మరేనండి. అతణ్ణి మీయింటోనే ఉండనియ్యాలి.

సం—అల్లానే. తరుచుగా చూస్తూండచ్చు.

న—పైగా, ఇతరుల్నించి బాధ ఉండదు.

సం—అల్లాగే. తీసుగురండి. బిల్లు జోరుగా అవుతుంది. చాయశక్తులా తంటాలు పడతాను.

న—తీసుగొచ్చానండి. ఇక్కడే ఉన్నాడు.

సం—మరీమంచిది. ఇప్పుడు మాయింట్లో ఒక గొప్ప వృద్ధవైద్యుడు మకాంగా ఉన్నారు. వారితో కుడా సంప్రతించి మరీ చేస్తాను, చికిత్స.

న—చిత్తం చిత్తం. నేనింకా ఏర్పాట్లూ అవీ చూసుగోవా లండి, వారిని మాత్రం లోపలికి పంపిస్తాను.

సం—అల్లాగే ఆయన చాలు పోనీ, మీరు వెళ్ళండి. నేను డాక్టర్ సముద్రంగార్ని లోపల్నించి తీసుగొస్తాను.

[అని కుడిమధ్యకి వెడతాడు. నవనీతం ఎడమమధ్యకి శఠ కోపాన్ని పిల్చి, ఒకసీటుమీద కూర్చోమని]

న—మీరిల్లా దయచెయ్యండి. మా స్నేహితుడు ఇంట్లోనే ఉన్నాడు. చెప్పాను. వస్తున్నాడు. యథాశక్తి మీకు ఆతిథ్యం ఇస్తాడు. నేను మా యింటికి పరిగెట్టి మీ గురించిన ఖంజా యింపులు చెయ్యాలి. వెళ్ళొచ్చి మిమ్మల్ని తీసుగెడతాను. ఇక్కడే ఉండండి.

[అని ఎడమ ఎదర్నించిపోతాడు. కుడిమధ్యనించి మొదట సంతానమూ అతనివెనకాల సముద్రమూ వచ్చి శఠకోపానికి చెరోపక్కా ఉండేటట్టు కుర్చీలు లాక్కుని కూర్చుంటారు.]

సం—(శఠకోపంకేసిచూస్తూ) మీకు ఉపచారం చెయ్యడం అనేది, నేను, గొప్ప గౌరవంగా భావిస్తున్నాను.

శ—ఎంతమాటెంతమాటా! తమ సేవకుణ్ణి.

సం—(డాక్టర్ సముద్రాన్ని చూపించి) ఇరుగో అఖండులు, నా సోదరులు వీరి సలహా పుచ్చుగున్న మీదటే నేను మిమ్మల్ని సేవించడం.

శ—నన్ను సేవించడానికి ఇంత అట్టహాసం అఖ్ఖర్లేదండి. నేను అల్పసంతోషిని,

సం—ఇల్లాచూడండి.

శ—చూడనా! ఎందుకూ? (అని చూస్తూ నిర్ఘాంతపోతాడు)

సం—అల్లా ఆయన కేసి తిరగండి.

శ—(దీనంగా) ఎందుకూ? (అని సముద్రం కేసి తిరుగుతాడు)

సం—చాలు. ఇల్లా తిరగండి. మీరు తిండి బాగా తింటున్నారా?

శ—దక్కినంతవరకు తింటున్నాను, అంతకంటె బాగా తాగుతున్నానుకుడానూ.

సం—అదేపాడుపని. ద్రవపదార్థాలగురించిన తృష్ణ ఉందే. అది, లోపల తిష్ఠవేసి ఉండుకుంటూన్న తాపంయొక్క సూచన. సరే, మీకు బాగానిద్ర పడుతుందా?

శ—ఓ. భోజనం ఉద్యాత్తం అయినప్పుడు వొళ్ళు తెలియని నిద్రపడుతూంటుంది.

సం—మీకు స్వప్నాలు ఒఖ్ఖరవ్వ జోరుగా వస్తూంటాయా?

శ—అడపా దడపా వస్తూనే ఉంటాయి. నా స్వప్నాలజోలి మీ కెందుకూ?

సం—మీకువచ్చే స్వప్నాల స్వభావం ఎటువంటిదీ?

శ—నా కొచ్చే స్వప్నాల స్వభావమా? ఓయి నీ సంభాషణ తగలెయ్యా? ఇదేం సంభాషణయ్యా ఇప్పుడూ?

సం—కొంచెం ఓపిక పట్టండి, మీ సంగతి మీ సమక్షంలోనే యోచిస్తాం. ఆ యోచన యావత్తూ మీకు బాగా అవగాహన అయే నిమిత్తం, అంతా వ్యావహారిక భాషలోనే జరుపుతాం.

శ—యోచన ఎందుకయ్యా! కాస్తఫలారం పెట్టడానికీ లేకపోతే కాస్తదాహం ఇవ్వడానికీనూ? ఆవతలనాకు అర్జెంటు పనికూడా ఉంది.

సం—మొదటిపని రోగాన్ని పసికట్టడం – అనగా రోగ స్వభావ నిర్ణయం.

స— శాస్త్రంకూడా అల్లానే చెబుతోంది.

సం—తరవాత ఔషధ నిర్ణయం, సేవానిర్ణయం, చికిత్సా నిర్ణయం, పథ్యనిర్ణయం-ఈక్రమం చొప్పున నిర్ణయించు గుంటూ పోవాలి.

శ—(ఇద్దరి కేసీ చాలా భయంతోనూ అనుమానంతోనూ చూస్తాడు).

సం—నాఉద్దేశం ఈయన వ్యాధి చింత–కేవల మిధ్యాచింత. ఇది ఒకరకం మతి భ్రమణం (సముద్రంతో) తమబోట్లకి కుడా పని చెప్పేరకం. మతి భ్రమణమూలాలు ఏవేవీ అంటే మెదడు, లేక కార్జమూ, లేక అన్నకోశమూ వీరి చింతా భయాశ్చర్యాదులు నే చెప్పినదానికి తార్కాణ. కళ్ళూ వాలకమూ కూడా తత్సంబంధ మైన సూచనలే. ఇది ముదిరి జీర్ణించి ఏక వస్తూన్మాదంలోకిగాని, క్షయలోకిగాని, మూర్ఛలోకిగాని లేక శుద్ధ పిచ్చిలోకిగాని దింపు తుంది. దీనికి చెప్పబడ్డ చికిత్సలు రక్తోత్సర్జనమూ, భేదిస్వీకర ణమూ, సార గ్రహణమూ, వినోదపదసంగీత శ్రవణమూనూ! అప్ప టప్పట నృత్యంకూడా చేస్తూంటే మాంద్యంపోయి చలాకీ హెచ్చుతుంది.

శ—(గుడ్లుతేలేసి నోరువెళ్ళబెట్టి గుండె బాదుకుంటాడు)

సం—డాక్టర్ సముద్రంగారూ, తమ అభిప్రాయం ఏమిటి ?

స—డాక్టర్ సంతానం మహాశయా ! మీరు చెప్పింది చాలా యథార్థం. మీకంటె ఎక్కువ దేవుడు చెప్పలేడు. నా వశమా ! మిధ్యాచింతగురించి మీరన్నది సత్యం. ఇతనికి ఆ వ్యాధి లోగడ వంట్లో లేకపోయినా పండితులైన మీరు దాన్ని వర్ణించడంలో చూపించిన ఊహాపోహల బలంవల్ల ఇప్పుడైనా ఈయనకి ఆ వ్యాధి సంక్రమించా లన్నమాట. ఈయన మీ చేతులో పడడం అనే అదృష్టం పెట్టిపుట్టాడు గనకనే ఈయనకి పిచ్చెత్తింది. ఈయనకే గనక వెర్రెత్తి ఉండకపోతే మీ వైద్య ప్రభావం ప్రపంచానికి తెలియక పోయేదిగదా ! తక్షణం బజానాగా ఒఖ్ఖ ఇంజెక్షన్ ఇప్పించండి. తరువాత క్షీరసారం ఇచ్చి స్నానం చేయించి నుదురుకి పట్టీ వెయ్యండి. ఆపట్టీలో ఉప్పుపడాలి. ఉప్పు జ్ఞాన చిహ్నం.

శ—ఓరి మీవాగుడు మండా ! ఇందాకణ్ణించి చూస్తాను, ఏమిటఠ్రా యిదీ! ప్రహసనం ఆడుతున్నారా ఏమిటఠ్రా మీరిద్దరూనూ!

స—ప్రహసనమా ? మేం ఆడటంలేదు.

శ—ప్రహసనం కాకపోతే, ఏమిటిమరి ఇందాకణ్ణించీ మీరు కిచకిచలాడింది ? వెధవ కిచకిచలాటా మీరూనూ, కోతిపీనుగుల్లారా ! పెళ్ళికని నేనొస్తే వెర్రేమిటఠ్రా, వెర్రిమొహాల్లారా !

సం—(తీవ్రంగాచూస్తూ) అయిగో, హెచ్చుతగ్గు కూతలు. ఇది మంచి సూచనే. ఇది వెర్రిలోనే జమ.

శ—ఆయిద్దరు పశువులూ ఏకమై నన్ను ఈయిద్దరి గాడిదల మధ్య పడేసి వెళ్ళారా ఏమిటిచెప్మా ! అయ్యో ! ఏమిటి ధరి !

(అని వాళ్ళమొహాలుచూసి, అసహ్యంగా) తుధూ (అంటూ ఉమ్మేస్తూ తిడతాడు)

స—చూశారా, చూశారా! ఇది మరో లక్షణం వెర్రికి - తెగఉమ్మడం.

శ—ఒరేయ్. మీరిద్దరూ ఏడిశారుగాని, చెరోఏడుపునూ, ఎవరి దార్ని వాడు పోదాం పట్టండి. నాకు వ్యవధిలేదు.

సం—ఇటూ అటూ పోవడం—ఇది మరోచిహ్నం వెర్రికి.

శ—ఓరీ మీ మొహాలు అంటించా, నాకు పెళ్లని నేవస్తే, నాకు వెర్రని మీ రేడుస్తున్నా రెందుకూ? నాతో ఏంపనిరా మీకు?

సం—మాకు వచ్చిన విన్నపం ప్రకారం మేం మీ కేసు పట్టాం. మీరోగం కుదర్చాలి.

శ—ఆమాట మళ్ళీఅను. నారోగం కుదురుస్తారా?

సం—నిశ్చయంగా,

శ—ఓరి మీరు నాశనమైపోనూ నాకు జబ్బేదర్రా కుదర్చడానికీ?

స—చూశారా! రోగి తనకి జబ్బే లేదనుకోడం అతని రోగానికి అమోఘ నిదర్శనం.

శ—నేను సుబ్బరంగా ఆరోగ్యంగా ఉన్నాను. చెబుతున్నాను వినండోయ్. కుంకల్లారా!

సం—మాకు తెలుసునయ్యా! నీ శరీరతత్వం లోకి చూశాం నీసు లోపల వ్యాధి ఉంది. మేం వైద్యం మానం.

శ—మీకిద్దరికే అదేం పెద్దరోగం తిన్నగా బతకాక! నాకు వైద్యం అఖ్ఖలేదు. వైద్యానికి నాకూ డిళ్ల. మందుకీ నాకూ చుక్కఎదురు. నేపోతాను.

సం—చూశారా. డాక్టర్ సముద్రం! ఇతడి వెర్రి మన ఊహని మీరిపోయింది,

శ—ఏమో! మాఅమ్మానాన్నా ఎన్నడూ మందులు పుచ్చుగోలేదు. వాళ్లు వైద్యసహాయం కించిత్తూ లేకుండానే చావగలిగారు.

సం—అందుకనే ఇటువంటి వెర్రిపుత్రుణ్ణి కన్నారు. (సముద్రంతో) అన్నా, రండి. మనవైద్యం ప్రారంభింతాం. చెలరేగిపోతూన్న ఇతని చిత్తవృత్తుల్ని అణిచి సాపుచేసి, శాంతపరిచి, సమదాయించి పారేద్దాం. (అని కుడిమధ్యకి పోతూ) రండి, వీధి తలుపు వేశార్లెండి. ఇతను ఇక్కడే ఉంటాడు (అని వెళ్లిపోతాడు).

స—(సంతానం వెనకాలే నడుస్తాడు)

శ—ఇదంతా చిత్రంగా ఉందే! ఈ ఊరు జనం ఏకమొత్తంగా వెర్రిపీనుగులా ఏమిటి చెప్మా! ఇంతపిచ్చి ధోరణి ఎక్కడాచూడలేదు. ఏమీ బోధపడటం లేదు. పెళ్ళికుదిరిందని నేవస్తే, నావెర్రికుదురుస్తార్ట వీళ్ళు! వీళ్ళకి బాగా పెళ్ళి చేసేసి వెర్రి వదలకొట్టేస్తాను. ముందు ఇక్కణ్ణించి పారిపోవాలి. (అని తలపట్టుగుని కుర్చీలో కూలబడుతూండగా, తెర)

## రంగం-4

[రెండోతెర ఎదట—కుడి ఎదర్నించి సంతానం ఖంగారుగా వస్తూంటే ఎడమ ఎదర్నించి మాలోకం వచ్చి కలుస్తాడు]

మా—(చిరునవ్వుతో) ఆయనకి కొంచెం నయంగా ఉం దాండీ?

సం—(విసుగుగా) నయమా? ఒకటే నయం దిక్కు-మాలాడికి!

మా—అదేమిటండోయి. అల్లా అంటున్నారు:

సం—ఏంచెప్పనూ! నేనువాణ్ణి ఎంత కట్టుదిట్టం చేస్తేం తెంపుగుని పారిపోయాడు చచ్చినాడు! నేను వాడికోసం ఏర్పాటు చేసిన మందులు బోలెడన్ని వ్యర్థం అయిపోయినాయి.

మా—ఇంత ఘరానామందులు చెడనాడుకుని వాడు పారి పోడం అనేది తనని తనే ద్వేషించుగోడం అన్నమాట— ఒక విధంగా ఆత్మహత్య అన్నమాట!

సం—సందేహంఏమిటీ! అతడికి రోగనివారణ అంటేనే కిట్టడం లేదు. అంటే ఏముటో తెలుసా? మతిస్థిరం లేకపోవ డమూ బుద్ధి నీచపడడమూ అన్నమాట.

మా—అడ్డమాండీ! పారిపోటుండాఉంటే ఈ పాటికి అన్ని రోగం సహం పైచిలుకు కుదిరిపోయి ఉండును. రూఢిగా.

సం—రూఢిగా, వాడిశరీరంలో పదిపన్నెండు వ్యాధులు కలిసి కుట్రచేస్తూన్నాసరే, అన్నింటినీ కట్టకట్టి కుదిర్చేసిఉండే వాణ్ణి.

మా—మరోటీ. మీ చేతులోపడబోయే యాభైరూపాయలూ కుడా పోగొట్టేశాడే.

సం—ఆఁ ఎల్లా పోగొట్టేస్తాడు పెర్రిపీసుగూ! అవి వదుల పంటానా, నేను! అవి మీ దగ్గర వసూలుచేసుగుని, వాడువద్దని

పట్టినాసరే వాడికి సదిర్చి తీరతాను. వాడు నామందు ఆరగించే ఖరాదు జరిగింది గనక, వాణ్ణిబలిమిని పట్టించి. వాడిమీద ఔషధ నిరాకరణ నేరం మోపిస్తాను.

మా—అల్లా చెయ్యడం న్యాయమే అనుకుంటాను. మీ మందులు అల్లాటివి. మరీ! పైగా మీకు రాగల సొమ్ము పోతోంది.

సం—ఎక్కడికీపోవని చెప్పానుగా! ఆ ఫరవాలేదుగాని, ఇప్పుడు వాడు నాకెక్కడ దొరుకుతాడా అని చూస్తున్నాను.

మా—నిస్సందేహంగా, ఒకానొకచోట ఉండచ్చునండీ

సం—ఎక్కడ—ఎక్కడ?

మా—అభిషేకం గారని ఉన్నాడే మహానుభావుడు! వారింటో!

సం—వీడికి వారితో బాంధవ్యం ఉందా?

మా—కాబోతోందిట. అభిషేకం కూతుర్ని ఇతడు పెళ్ళాడ తాడట. కర్మదశ. ఈకాబోయే అల్లుడికున్న లోపం ఆ అభిషేకం గారికి తెలియదుగావును! తొందరపడి ఆయన తనపిల్లని ఇతని చేతులో పెట్టేస్తాడేమోకూడాను!

సం—అల్లానా! అల్లాజరక్కుండా నేవెళ్ళి మాట్లాడతా, ఈపళంగావెడతా, సచేలంగా వెడతా!

మా—మీగౌరవం మీరు నిలబెట్టుకోవాలంటే మీరు వెళ్ళి తీరాలి లా కనిపిస్తోంది.

సం—నేను వెళ్ళితీరతా. రోగి ఊరేగి వైద్యుణ్ణి త్రుణీక రిస్తూంటే, వైద్యుడు నోరుమూసుకుంటాడా? అతణ్ణే పట్టుగుని నాసలహా ఇచ్చితీరతాను.

మా—మాబాగా అన్నారు. నేనే మీరైయుంటే, అతనికి తనివితీరా మందులు వేసింతరవాతే గాని, ఈలోపల అతడికి చచ్చినా పెళ్ళి కానివ్వను.

సం—నేనూ అంతే. అతడికి చచ్చినా వైద్యం మానను (అని గబగబా ఎడమ ఎదరికి పోతాడు)

మా—(కుడి ఎదరికి నడిచి) సరి, వీడు అభిషేకం దగ్గిరికె వెడతాడు, మాయలో పడిపోడానికి అభిషేకం ఒకటోరకం—అనగా అల్లుడికి చింతాకువాసైనా తీసిపోని మామగారు. నేనూ వెడతా ! అభిషేకంగారిమీద పరో ప్రయోగం చెయ్యాలిగా !

[అని, కుడి ఎదరికి పోతూండగా, రెండోతెరరేస్తుంది]

సం—(ఎడమ మధ్యనించి వచ్చి కుడిమూలకేసి వెళ్లి, ఏమండోయ్ ! అభిషేకంగారూ !

అ—(కుడిమూలనించివచ్చి) అయ్యా ! వస్తున్నా ! (అని. వెనక్కి వెళ్లి రెండుకుర్చీలు తెచ్చివేస్తూ) రండి, కూచోండి.

సం—(కూర్చుంటూ) మీతో మాట్లాడాలి.

అ—(కూర్చుంటూ) అవశ్యం మాట్లాడండి.

సం—మీ అమ్మాయిని ఎవరో శఠకోపంగారు పెళ్ళాడతాడట నిజమేనాండీ !

అ—నిజమే. ఇహనో ఇప్పుడో అతడు పిల్లిసీమనించి రావాలి.

సం—వచ్చాడు లెండి. అందుకుకాదు.

అ—ఆఁ వచ్చాడా, ఎడీ ?

సం—ఎమో ! నాయింట్లోంచి ఉడాయించేసాడు. అతణ్ణి వైద్యం నిమిత్తం నా కప్పగించారు.

అ—ఆఁ ఆఁ వైద్య మేమిటీ!

సం—సూర్యుడుమీద ఒట్టెట్టి చెబుతున్నాను—మీరు తొందర పడి మీపిల్లని అతనికి ఇయ్యకండి. మొట్టమొదట నేను అతణ్ణి పెళ్ళికి అర్హుణ్ణిగా చెయ్యాలి. మనస్థిమితంగల మనమల్ని మీరు ఎత్తడానికి వీలైన స్థితిలోకి అతణ్ని నేను తీసుగురావాలి.

అ—ఏమిటి మీరనే మాటా?

సం—ఏమీలేదూ. మీ కాబోయే అల్లుడు జబ్బుమనిషి, నా దగ్గిర వైద్యానికి చేరాడు.

అ—వెనకట్లోనా ఏమిటి?

సం—కాదు, ఇప్పట్లో—గంట కిందట!

అ—హారి వీడి రోగం చల్లగాఉండా! అయితే ఏం వచ్చిం దిప్పుడూ!

సం—వినండి. అతని వ్యాధి మీద నాకు హక్కుంది, గనక ఆవ్యాధి నాఆస్తి. మాశాస్త్రప్రకారం నామందులు అతడు స్వీక రించి నావ్యాధి నాకుముఖరా ఇచ్చి నన్ను తృప్తిపరిచే లోపుగా, అతనికి పెళ్ళిగాని మరొకటిగాని జరపడానికి నేను అనుమతి ఇయ్యను.

అ—(ఆశ్చర్యపడి) ఏమిటేమిటీ! అల్లాయితే అతడు ఏదైనా రోగంతో తీసుగుంటున్నాడా ఏమిటి కొంపతవ్వి!

సం—ఆ ఒక పెద్దరోగంతో ఘాటంగా తీసుగుంటున్నాడు.

అ—అయ్యో అయ్యో! అతడి కొచ్చిన పెద్ద రోగమేమిటో దయచేసి చెప్పండి.

సం—ఆక్షోభ మీకెందుకు పోనిస్తురూ! ఏదో....

అ—నా కెందుకేమిటీ? ఏడిసినట్టేఉంది. ఏముటో చెప్పండి.

సం—అబ్బ! వైద్యులుగుప్తంగా ఉండితీరాలి. ఆసంగతి ఎత్తకండి. ఆరోగికి పెళ్ళిమాత్రంవద్దు. చేశారామీకూ మీ అమ్మాయికీ చిక్కులు తప్పవ్. పైగా, మా వైద్యపరిషత్తుకి కోపంవచ్చి మీకు దోసెడు వ్యాధులు సంక్రమించేటట్టు చేసెయ్య గలదు. నేచెబుతూన్నది వొట్టి భేషజంకోసంకాదు, జాగర్త.

అ—అల్లాయితే, మాఅమ్మాయి పెళ్ళి ఆపేస్తాను.

సం—ఎంజేస్తాంమరీ! ఆపడం తప్పదు. అతడు నావైద్యా ధీనంలో ఉండితీరాలి.

అ—అల్లానే కానీండి

సం—వాడు పారిపోయినా లాభంలేదు. పరిషత్తువారిచేత అతడికి శిక్షవేయించి, అతణ్ణి పట్టించి తెప్పించి, నా వైద్యం ఆచరించి తీరతాను.

అ—అల్లానే కానీండి.

సం—ఒకవేళ వాడు కనిపించకపోతే,

అ—ఆ(

సం—పూచీ మీదేగనక, మీకేనా వైద్యం జరిపేస్తాను.

అ—అయ్యో, నాకా? నేను రాయల్లా ఉన్నాను, నాకెం దుకూ వైద్యం?

సం—మీరు ఎంతరాయల్లా ఉన్నాసరే ఫర్వాలేదు. నాకు ఎవరో ఒకరోగి ఉండాలిగనక, వీలునుబట్టి ఎవరైనా సరే రోగిగా స్వీకరించగలను.

అ—స్వీకరించండి గాని, నేను మాత్రం రానండోయ్, (తనలో) వీడిమొహంలా ఉంది.

సం—వీలుసుబట్టి, అని చెప్పావుగా! (అని, లేచి, తొందర తొందరగా, బెదరింపువైఖరితో, ఎడమ మధ్యకె, వెళ్ళిపోతాడు)

అ—(నంతాసంకేసి చూస్తూ ఎడమ మధ్యదాకా వెళ్లి నుంచుని, నిదానంగా) రోగంలేనివాడిరోగం సదురుస్తాట్ట, ఏంరోగమో!

[కుడిఎదరనించి, తలుపులు కాబూలు వడ్డీవ్యాపారస్తుడి వేషంలో వస్తాడు]

త—(కుడిచెయ్యి నుదురుకి తాకిస్తూ) షలాంఅండీ,

అ—(కుడికి తిరిగి) ఎవరుమీరు?

త—మన్పేరూ జమాల్ఖాన్ ఉన్నాడు.

అ—ఎక్కడున్నాడూ?

త—క్యా అయ్యా, మేం కాబూల్ డబ్బాఫాయిదా మన్సీ.

అ—అల్లానా, రండి, కూర్చోండి. (అని, వాడు కూర్చున్నా తను నుంచుంటాడు) ఏమిటిపని?

త—(కూర్చోబోతూ) కొంచెం చిన్న ఖబర్ కావాలా. మీరూకూచో.

అ—కూచుంటాన్లెండి. చెప్పండి.

త—యకాయక్ కూచోండి. నైతో మాదీ షూతీ విప్పం.

అ—అల్లాయితే సరేనయ్యా! సరే! (అనికూచుని) ఏమిటి సంగతి!

త—యహ్ పత్తన్మే, అప్పేకం-అప్షేకంపేరూతో ఆద్మీ ఉంది. తెల్సున్నీకీ!

అ—ఆ.

త—షంతోసం. దయచేసీ చెప్పు. వాడు హెట్టాంటీరకం?

అ—రకానికేముందీ! అంచరివంటివాడే.

త—అద్కాదూవోయ్, ఆడ్కి ఖజానా జోర్ ఉందీ, లేదూ? ఆడ్ దౌలత్‌మంద్ హైనై ?

అ—ఆ. డబ్బున్నవాడే.

త—ఠీక్. ఆడ్కి బడే దౌలత్ ఉందీగా! సాలా ?

అ—ఆ.

త—ఈ సామాచార్ మాకి హెక్వా ఖుషీ, సాలాషంతోసం.

అ—ఏం? నీకు సంతోషం ఎందుకూ మధ్యా?

త—దాన్కి గొప్ప సబద్ ఉందిరెండీ. హోక్టీ, కొంచెం.

అ—ఏమిటదీ ?

త—ఆడ్కి కూతుర్ వాడ్కి సెట్‌కోపంకీ నిఖా సేస్తార్ అనీ ఖబర్ యిన్కుంది, మేం,

అ—ఏంటే ?

త—ఆసెట్‌కోపం ఉన్నాడూచుడండీ, ఆడూ మాకీ బాకీ, అపురేక్‌కి బాకీ. దస్మందీ ఖజాంచీల్కి బాకీ. బహుత్........ సాలా........

అ—అయ్యో భర్మమా! ఇంకాఏముదో అనుకున్నాను! ఇదోటిపుడానా? ఆ శరకోపం మీకూ పదిమంది ఇతరులకీ కుడా బాకీయే! చచ్చామే!

త—అవున్, ఆఠ్ మాస్‌కీ నీచే ఆడీఉపర్ డిక్రీతీశాం. ఉండండీ రా, అప్షేకం బేటీతో బ్యాహ్‌సేస్తాం, పత్రం సొమ్ము ఇచ్చియేస్తాం అని జర్పీ యేశాఛ్.

అ—ఓరి వీడు ఇదైపోనూ! పెళ్ళి అయిం తరవాత బాకీలు తీర్చేస్తానని వాయిదాలేసి జరుపుకొస్తున్నాడా ?

త—హో మహరాజ్; ఇఖ శుషాదీ ఎష్టా అయి తుంది రా అని నాక్ పట్టి సూస్తూ ఉన్నార్, మేఁ.

అ—మంచిపనే, అల్లా చూస్తూండండి పని జరుగుతుంది. అయితే మరినాకు సెలవ్.

త—(లేచి) షెలవ్, తమ్రిదయాకీ షలాం.

అ—(లేచి) కృతజ్ఞుణ్ణి.

త—ఈ చోటీ ఖబర్ తమ్రూ నాకీ ఇచ్చినందుక్ మీకీ సౌహజార్‌షలా మేఁ.

అ—సరే సరే (అని తొందరగా కుడిమూలకి పోతాడు)

త—(ఎడమ ఎదరికివెళ్ళి. కొంతడ్రెస్సు తీసేసి తను తలుపులు అయినట్టు సభకి వెల్లడిచేసి) అక్కడ వ్యాపారం, అనుకుట్టే నడిచింది. వెళ్ళి, తరవాత వేషం, తయారవుతాను, (అని ఎడమ ఎదరికిపోతాడు)—(తెర)—

## రంగం-5

[రెండో తెర ఎదట, పరుగెత్తుకొచ్చినప్పటి ఆయాసంతో శఠకోపం కుడి ఎదరనించి ప్రవేశిస్తాడు]

శ—(వచ్చి కుడివేపు చూసి) వీళ్ళని చంపెయ్యా! ఏముటో వీళ్ళ అభిప్రాయం! కుంకలెవరేనా పోగై పెద్దకుట్రపన్న లేదుకదా అని!

[ఎడమవేపు తిరిగేసరికి మాలోకం కనిపిస్తాడు]

శ—ఏమిటండీ, మిత్రమా! పోసీ లేస్తురూ! (అని ఉసూరుమంటాడు)

మా—(ఎడమ ఎదరనించి తొందరగా వస్తూ) మీ సామానూ....

శ—దిక్కుమాలి సామాను రేస్తురూ:

మా—అయ్యో, అదేమిటండీ! ఏమన్నా జరిగిందా ఏమిటి? ఏమిటి తమ బాధ?

శ—ఏముందీ! ఎటు చూసినా ఇంజెక్షన్‌సూది కనబడుతోంది.

మా—(నమ్మనట్టు) ఛ. ఛ, అదేమిటండోయ్!

శ—నన్ను ఆ యింట్లో అప్పగించారేం, అక్కడ నాకు జరిగిన మంగళం మీరు ఊహించలేరు,

మా—అయ్యోయ్యో! ఏం జరిగిందండీ!

శ—అక్కడ నాకు మాంచి ఫలారం పెడతారు గావును పోనీ లోపలికి పుచ్చుగుందాం, అనుకుంటిని.

మా—ఆఁ పెట్టలేదూ?

శ.. అబ్బే ఫలారమూలేదు దిబ్బాలేదు. "మిమ్మల్ని వీరి చేతుల్లో ఉంచుతున్నాను" అని చెప్పేసి ఇందాకటివాడు తోక ముడిచాడు. ఇంతలో దెయ్యాల్లాంటి డాక్టర్లు ఇద్దరు-వాళ్ళమధ్య కుర్చీలో నన్ను పాతేసి చెరోచెయ్యీ చూశారు! ఇదో చిహ్నం—ఇదో దాఖలా—ఇదో లక్షణం—అంటూ గింజుకుని ఆ బొంత కుక్క లిద్దరూ, కూడ బలుక్కుని, నాకు వెర్రి అని తేల్చారు. అక్కణ్ణించి, వాళ్ళిద్దరూ నన్ను ఒంటరిగాణ్ణి చేసి పడగొట్టి. "మంచిపని చేస్తుంది, పుచ్చుగోండి, నిమిషం కళ్ళు మూసుకోండి", అంటూ మొదలెట్టి ఆ మాయిధారి ఇంజక్షన్‌సూది

పుచ్చుగుని నా జబ్బలు రెండూ చిటుగూ చిటుగూ వి_స్తరి కుట్టి నట్టు కుష్టేశారు.

మా—అది సరిగానండీ, ఏమిటంటారు వాళ్ళ అభి(ప్రాయం? దీని కర్థం ఏమన్నమాటా?

శ—ఏమన్నమాటా, నేనంటే పడిచచ్చి పోతూన్నట్టు నటించి నన్ను అక్కడ దింపాడే, ఆ పీనుగు కేవలం మాయల మారి పీనుగన్నమాట! ఇంక వాళ్ళ అభి(ప్రాయంతో పనేమిటి నా బొందా!

మా—అయ్యో అయ్యో! ఇల్లా ఎక్కడేనా ఉంటుందండీ:

శ—ఏమో గాని ఇక్కడ అల్లాఉంది. పైగా, డజను మంది తుంటరి భడవలు నన్ను వెంట తరిమారు. వాళ్ళని తప్పించు గుని ఇవతల పడేసరికి సకల గడ్డీ కరిచాను.

మా—(ఆశ్చర్యంతో) గడ్డి (ప్రియమేనండీ ఈ రోజుల్లో, ఎల్లా కరిచారోగానీ: ఆహా! ఔర! మనుష్యుల చూపులు ఎంత మాయ చూపులో! వాడు మీకు చాలా ఆంతరింగిక స్నేహితుడని నేను నమ్మవలిసి వచ్చేటట్టు నాకు తోచాడు స్మండీ, ఉంటారు గాపును అల్లాంటి లుచ్చాలు! ఏమి శోద్ధెం!

శ—నాకిహ రొండోఊహే లేదు. ఏవైపు నేను చూసినా నాకేసి పది పన్నెండు ఇంజెక్షన్ సూదులు వస్తూన్నట్టు కనిపి స్తూంటుంది.

మా—ఛ ఛ. అచ్చే బొ_త్తిగా మరీ పాడైపోయింది, మీ అంటవారిమీద ఇంతదు(రా ఇంత దౌర్జన్యమూనా, ఓ మో_స్త రై తే అనుకోవచ్చు గాని! శృతిమీరి పోయింది.

శ—అవును గాని, అభిషేకంగారి యిల్లు చూపిస్తురూ! అక్కడికి చేరుకుంటే మనస్సేనా స్థిమితపడుతుంది!

మా—(నిర్ఘాంతపోతూ) ఆఁ ఆఁ! ఎవరిల్లెవరిల్లూ!

శ—అభిషేకంగారిల్లు.

మా—ఓహోహో! మీరు శృంగార పురుషులేనండోయ్, రసికులే అల్లా అయితే? అభిషేకంగారి కుమార్తె సంగతి గాని మీ రేమన్నా ఎరుగుదురా ఏమిటి?

శ—(నవ్వు ముఖంతో) ఆ, ఆ పిల్లనే నేను పెళ్ళాడ బోతూంటా!

మా—(బొమముడితో తీవ్రంగా) పెళ్ళాడ బోతున్నారా?

శ—(సంతోషంతో) మరే!

మా—శాస్త్రీయంగానేనా పెళ్ళాడబోతూంటా?

శ—అవును, మరోమోస్తరు ఎల్లా ఉంటుందీ!

మా—అల్లాయితే అదెందుకులెం డిప్పుడు! నన్ను క్షమించండి.

శ—ఏమిటి ఆ అదీ?

మా—అబ్బే, ఏమీ లేదు.

శ—అహఁ, చెప్పండి.

మా—అబ్బెబ్బే! ఏం లేదండీ! నేను ఎదో తొందరలో అనేశాను.

శ—అబ్బ! చెప్పండి, బాబ్బాబు!

మా—అబ్బ ఎందుకు లేస్తు రిప్పుడూ?

శ—అహఁ అల్లాకాదు, చెప్పాలి.

మా—వద్దండి మహరాజా, నన్ను క్షమించండి, ఎందు కొచ్చింది.

శ—ఇంతేటండీ నాకు ముఖ్యస్నేహితులై ఉండీ!

మా— ముమ్మాటికీ! నాకంటె మీకు ముఖ్యు దెవడూ?

శ—అల్లాం టప్పుడు మన్లో మనకి దాపరికాలు తగునా?

మా—తగవనుకోండీ, అయినా, ఇరుగు పొరుగువారి గౌరవా గౌరవాలు నాకెందుకూ అని చూస్తున్నా.

శ—నాకు మీయందుండే విశ్వాసానికి దాఖలా ఇదిగో (అని ఒక ఉంగరం తీసి మాలోకం వేలికి పెడతాడు) మీ మనస్సు నా కిస్తేగాని నేను ఒప్పను.

మా—(ఉంగరం ధరించి) అబ్బ, నన్ను చాలా ఇరుకులో పడేశారండీ. కాస్త గుక్క తిప్పుగో నియ్యండి. (అని తనలో లాగ) హా దైవమా! నాకు పెద్దచావొకటి తెచ్చి పెట్టావే! అవతల తొందరలో లాభసాటిగా తనకూతురికి గొప్ప పెళ్లిచేసేసి పంపదల్చిన తండ్రి! ఆపిల్లను గురించిన రహస్యం ఈయనతో చెప్పాలి. ఈయన అమాయికుడు, పరాయివాడు, నన్ను నమ్మిన వాడూ! ఆ రహస్యం వెల్లడిచేస్తినట్టాయినా ఆ కుటుంబం మీద పాడు ప్రచారం చేసినట్టవుతుంది. ఆ రహస్యం కప్పెట్టి ఊరుకుంటినా ఎరుగుండి ఈయనకి ద్రోహం చేసినట్టవుతుంది. ఎమో, ఈయని మంచి చూస్తే చెప్పెయ్యాలనే ఉంది. పెళ్ళంటే క్షణికవ్యాపారామా, వెయ్యేళ్ళపంటా! ఈయన నన్ను నమ్మిన దాఖలాగా ఉంగరంకూడా ఇచ్చారు. ఇక ఆగలేను, చెప్పేస్తాను.

(పైకి) అయ్యా! మనసారా చెప్పేస్తున్నాను. పరోక్ష జనం గురించి మాట్లాడవలిసొచ్చినప్పుడు వీలైనంత మార్దవంగా ఉండా

లని శాస్త్రం చెబుతోంది. నేను అల్లాగే ఆరిందాగా ఉంటాను. ఆ పిల్ల కేవలం భ్రష్టురాలు అనడం కొంచెం ఘాటుగా ఉంటుంది. అ పిల్లకాస్త షోకేళాగా మాత్రం ఉంటుంది అనడం బొత్తిగా చప్పగా ఉంటుంది. కాని, ఆపిల్ల తనుచూసిన ప్రతీవాడి వెన కాలా వెడుతూంటుంది అని చెప్పడం మధ్యరంగంగా సమ పాళంగా నిజాయితీగా ఉంటుందని నామనవి.

శ—(నోరునొక్కుగుని) ఇదా మధ్యరంగం! అల్లా చెప్పు మరీ! అయితే వీళ్ళంతా నన్ను శుంఠకింద కట్టదల్చారన్న మాట!

మా—(నమస్కరిస్తూ) ధర్మమా మీరల్లా అనడం! ఒక్కొక్కప్పుడు అపవాదం ఊరికే పుట్టచ్చు. కొందరు కొందరు అప వాదం అంటే లెక్ఖచెయ్యరు. అపవాదకీ గౌరవానికీ అనుబంధమే లేదని వాళ్ళ ఊహ.

శ—నీపుణ్యమాయిరిలే బాబూ! ఈ అపవాద నా నెత్తిని కట్టుగోవాలనే కుతూహలం నాకు లేదు. మాకిటికోటి వంశం వాళ్ళు నిష్కళంకంగా బతికిన ఘటాలు!

మా—(ఎడమ మధ్యకి చూస్తూ) అదుగో అభిషేకంగారు. నే నిప్పుడే మళ్ళీవస్తాను. (అని, కుడి ఎదర్నించి జారిపోతాడు)

అ—(ఎడమ మధ్యనించి వస్తాడు)

శ—నమస్కారమండీ.

అ—నమోన్నమః. విధేయుణ్ణి.

శ—మీరు అభిషేకంగారులా కనిపిస్తున్నారే!

అ—చిత్తం.

శ—నే నెవర్నో తెలుసా? శఠకోపాన్ని.

అ—ఓహోహో ఓహోహో! రండి, ఇంటికెడదాం, ఇక్కడే.

శ—(హేళనగా) సరేగానండి, అభిషేకంగారు! మాపిల్లి సీమ జనం అంతాకుడా మూర్ఖులనా తమరి భావం?

అ—(తత్తుల్యంగా) మానగరజనం యావన్మందీ గాడిద లనా, తమరి భావం?

శ—నాకు ఓపెళ్ళామే దొరక్కుండా ఉందని నేను ఏడుస్తున్నాననుకున్నారా?

అ—మాపిల్ల ఓ ముగుడే దొరక్కుండా ఉన్నాడని ఏడుస్తోందనుకున్నారా?

శ—చెప్తాను నడవండి, మరి.

అ—చెప్తాను రండి, మరి. (అని, ఎడమ మధ్యకి నడవగా వెనకాలే శఠకోపం వెడతాడు)—(తెర)

## రంగం-6

[కుడి పక్క అభిషేకం ఇంటిహాలు కనపడుతుంది. ఎడమ ఎదరనించి మొదట అభిషేకమూ వెనకాల శఠకోపమూ వచ్చి కూచుంటారు. కుడిమధ్యనించి సలిలం వస్తుంది]

స—నాన్నా!

అ—ఆఁ.

స—ఇల్లారండి. (అని కుడి ఎదరకి జరుగుతుంది.)

అ—(లేచి, కుడిఎదరకి వస్తాడు)

స—(రహస్యంలాగ) నువ్ చెప్పిన పెళ్ళికొడుకు వచ్చారట్గా. నాన్నా! ఆ కూచున్నాయనే గావును, నా మనస్సుకప్పుడే అల్లా తోస్తోంది.

అ—అబ్బ. నిమ్మళంగా మాట్లాడు.

స—ఇంకా నిమ్మళంగా ఏమిటినాన్నా! ఆయన అందాల పుట్ట. ఎంత షోగ్గా కూచున్నారో! అయ్యో అయ్యో! ఎవరికైనా సరే ఉంటే ఈయనే ఉండాలి భర్తగా! వెళ్ళి ఒఖ్ఖమాటు ఎదర పడి హెచ్చరించి రానా, నాన్నా!

అ—అబ్బ ఉండూ. బాగానే వచ్చింది నీతోటి. ఇంత తొందరకూడదు, కాస్తంత నిదానించాలి.

శ—(నాలికతో చప్పుడుచేసి) నడకలో ఏమి ఆ చకచకా! ముక్కుమీద ఏమి ఆ కోపమూ:

అ—అయితే చూడండీ శఠకోపంగారూ! ఇందాకా ఏకారణం వల్ల తమరు పెదధోరణిగా ప్రసంగించారో..........

స—(శఠకోపాన్ని సమీపించి, దీనంగా చూసి, చెయ్యి పట్టుగోడానికా అన్నట్టు నటించి) అయ్యా! మిమ్మల్ని చూసిం తరవాత నాకు పోయినప్రాణాలు మళ్ళీ వచ్చాయి. ఇక ఒఖ్ఖ క్షణకాలంకూడా నేను ఆలస్యం భరించలేను.

అ—సరిలెం! చెబుతున్నాను. నువ్వు వెళ్ళిపో. ఊఁ.

శ—(తనలో) ఆహాహా! అరమరలులేని ఒయ్యారి భామ! సభాకంపంలేని సులభసాధ్య; భయభావం లేని స్వేచ్ఛామూర్తి!

అ—ఏమండీ! మీరు ఏ ధైర్యం చొప్పున ఇందాకా........

స—(శరకోపాన్ని సమీపించడానికి యత్నిస్తుంది)

శ—హాదైవమా! హా హృదయమా! ఓసి వివాహమా!

అ—(సలిలంతో) అరే! మళ్ళీ అదేధోరణీ. చెబుతూంటే నీక్కాదూ!

స—మీరు నిశ్చయించిన నా భర్తని నేను ఆరాధించ కూడదా, నాన్నగారూ!

అ—(కోపంగా) కూడదు. నువ్వుముందు లోపలికి వెళ్ళు.

స—పోనీ వారిని చూసి ఆనందించనీండి, నాన్నా.

అ—చెబుతున్నాను. లోపలికి, పో

స—పోనీ, దూరంగా నుంచుటాను, మీ రొప్పుగుంటే.

అ—నేను ఒప్పుగోను. తక్షణం గనక నువ్వు ఇంట్లోకి వెళ్ళకపోతే...............

స—సరే. అల్లాయితే వెళ్లిపోతాను.

అ—(శరకోపంతో) మా పిల్ల వొట్టి మూర్ఖురాలండి, దీనికి అర్థం శుభం తెలియదు.

శ—(తనలో) ఎల్లా తెలుస్తుందీ! ఈ పిల్లిమనస్సు నన్ను గురించిన ప్రేమతో నిండిపోయింది కాబోలు!

అ—(సలిలం ఇంకా ఆగగా) నువ్ వెళ్ళవా?

స—వెడతాను గాని, నన్నువీరికిచ్చి పెళ్ళిచెయ్యడం ఎప్పుడో చెప్పండి.

అ—ఎన్నడూ ఉండదు. నిన్ను ఈయన కివ్వాలని ఉద్దేశించలేదు.

స—నన్ను వీరికే ఇచ్చితీరతానని మీరన్నారు. మీరన్న మాటతప్పకండి, అయ్యో: నాకు వీరేకావాలి, వీరేకావాలి నాకు.

అ—నిన్ను ఇతడికే ఇస్తానని నీతో నేను అనుంటే. ఆమాట ఇప్పటితో రద్దు!

శ—(తనలో) నన్ను నల్చుగుంటుందా అన్నట్టు నాకేసి ఎల్లాచూస్తోందో, పాపం, ఆఁ....

స—మీ ఇచ్ఛ ప్రకారం మీరు చెయ్యండిగాని, ఎవరు వద్దా న్నాసరే, మా యిద్దరికీ పెళ్ళితప్పదు.

అ—అది రద్దు చెయ్యవలసిన మోస్తరు నాకు తెలుసు. ముందే చెబుతున్నాను. పో, పిల్లకి బొత్తిగా మతిపోయినట్టుంది.

స—(వెళ్ళలేక వెడుతూన్నట్టు కుడిమధ్యకి వెళ్ళిపోతుంది)

శా—అయ్యా, కాదల్చిన మామగారూ! మీరు అంతగా శ్రమపడి పోకండి. మీ అమ్మాయిని లేవదీసుకుపోయే ఉద్దేశం నాకు లేదు. నాకీ విసినికర్రని అంటగట్టాలని చూస్తున్నారు గావును, ఈఅమ్మాయిలాంటిది శత్రువుకేనా వద్దు. మహ ప్రభో!

అ—సరిసరి ఇదోటాపైపెచ్చు! మీరు పరమశత్రువుకేనా వద్దు. మహాప్రభో!

శ—ఏమిటి మీ ఊహా?

అ—ఏమిటి మీ వెర్రి!

శ—మీ దుంపతెగా. మీరూ ఆమాటే! శ్రీ కిటికోటి శర కోపం అంటే ఏమని చూస్తున్నారు! నీళ్ళల్లో గేదెని బేరమాడి కోనుక్కునే బాపతనుకున్నారా? లోకంలో జరిగే సంగతులు

తెలుసుగునే పాటి బుద్ధి రేని రకం అని భావించారా! ఉన్న మర్యాద ఊడ్చెయ్యకుండా ఉండే పిల్లనే పెళ్ళాడలనే మాత్రం తోచని పసరం అని ఎంచుతున్నారా?

అ—లేదులేదు. మీ ఐశ్వర్యం ఏమిటో మీకే తెలియాలి గదా! డాక్టరు దగ్గిర మందుచ్చుగోడానికి బాహాటంగా ప్రవేశిస్తిరి గదా! అటువంటి మీకు, నాపిల్లదాన్నిచ్చి పెళ్ళిచెయ్యడానికి— ఇన్నేళ్ళు నెత్తిమీద కొచ్చిన పీసుగుని—నారు, ఆలోచనలేదనీ ఇంగిత జ్ఞానం లేదనీ మీ బుర్రలోకి ఎల్లా ఎక్కిందీ?

శ—నా ఐశ్వర్యమా? నాయింటికొస్తే 'చూపిస్తాను. వైద్యమా! మందూలేదు మాకూలేదు. ఎవళ్ళో అవాదు నా మీద వేశారు. నాకు రోగంలేదు. పిడిరాయిలా ఉన్నాను, విస్తరి పత్రండి నా ఆరోగ్యం మీ రిక్కడే కళ్ళాలా చూడచ్చు.

అ—అబ్బో! ఈ కోరలకేంలెండి. ఆడాక్టరేవచ్చి చెప్పేశాడు

శ—ఛీ, ఆడాక్టరు అబద్ధం ఆడాడు. నేను మహాజనుణ్ణి. కత్తిపట్టుగుని ఆ డాక్టరుగాణ్ణి ఎదురుకుంటాను.

అ—ఏది నమ్మాలో నాకు తెలును లేస్తురూ. మీరు నన్నిక దగా చెయ్యలేరు. వైద్యంగురించీ అంతే, పెళ్ళిరోజున మీరు చెల్లించడానికి ఒప్పుగున్న బాకీలగురించీ అంతే?

శ—బాకీ లేమిటీ?

అ—ఒస్ ఒస్. ఏమీ ఎరగనట్టు! .ఆ కాబూలీ షాహుకారు వచ్చాడురే. నీ ఋణదాతలంతా డిక్రీపొందారట నీ మీద ఎనిమిది మాసాలైందిట.

శ—ఆరె! ఏమిటీ అర్థంలేని మాటలూ! ఋణదాతలు నామీద డిక్రీ పొందడం ఏమిటీ మీపిండం!

అ—ఇప్పు డంతా ఎందుకులెండి. మీకంతా తెలుసు.

(ఎడమ ఎదరనించి 'నాథా నాథా' అని కేకలు వినిపిస్తాయి)

శ—మిమ్మల్నేగావును, ఎవరో పిలుస్తున్నారు.

('హా శఠకోప నాథా' అని లోపల్నించి మళ్ళీ వినిపిస్తుంది)

అ—నన్నుకాదు నన్నుకాదు, మిమ్మల్నే? మీతాలూకు స్త్రీలా ఉందే! మీరు స్త్రీప్రమేయంలోకుడా ఇంతేనా మహాశయా!

శ—అరె అరె (అని నిర్ఘాంతపోతాడు)

అ—కనుక్కుంటానుండండి. (ఎడమ ఎదరికి నడిచి చూసి) మీ ఆయనకోసమా అమ్మా వచ్చావూ! చెప్పి నీదగ్గిరికి పంపిస్తానుండు. (వచ్చి శఠకోపంతో) మీ ఆవిడేటండీ వచ్చిన ఆవిడా. దయచెయ్యండి. (ఎడమ ఎదర్నించి వినడం నటించి) అల్లానా! ఏమండోయ్, మీరు ఆవిణ్ణి పెళ్లిచేసుగుని మూడేళ్లైందిట!

శ—(విసుగుగా) మూడేళ్ళైందా? మీమొదం. మీమొదమూ దాని మొహమూనూ!

అ—మాటలు తిన్నగారానీండి.

శ—మీరు మాటలు అసలు రానీకండి. లేకపోతేనూ, నేను పెళ్ళాడేశానుట! నాకు ఏమాత్రమైనా తెలియదూ అమాటే నిజమైతే!

అ—(వినడం నటించి) సరేసరే. వెళ్ళమ్మా. నీకు భయం అక్కర్లేదు. వీడి కింకా నాపిల్లనికుడా ఇస్తానా ఇప్పుడూ!

(ఎడమ మధ్యనించి, "నాన్నోయ్, నాన్నా! ఏం నాన్నా; అల్లా చూస్తావేం నాన్నా" అని రెండుమూడు గొంతికలు ఒక మాటే వినిపిస్తాయి. 'అమ్మోయ్, నాన్నడుగో నేవ్' అనికుడా గట్టిగా వినపడుతుంది)

అ.—(అటునడిచి, చూసి, నిదానించి) అయ్యో అయ్యో! మీ పెద్దభార్యా ఆవిడ పిల్లలూట వచ్చారండీ.

శ—ఏడిశారు పోదురూ!

అ—నేనా వాళ్ళా?

శ—మొదట మీరూ తరువాత వాళ్ళూనూ! ఇదంతా ఏదో పన్నాగం?

అ—మాపిల్ల గొంతిగ కొయ్యడానికొచ్చి ఏమిటయ్యా ఇంకా వాగుడూ! ఇదివరకే నీకు ఇద్దరు పెళ్ళాలాయె, గంపెడు పిల్లలాయె, తగుదునమ్మా అని పెళ్ళికి మళ్ళీ తయారయావా బుగ్గని చుక్కెట్టుగుని! సిగ్గు వొదితే స్తే సర్వాన్నీ జయించ వచ్చునవా నీధైర్యం! సకాలంలో నాకు తెలిసింది నయమే. లేకపోతే నాపిల్లని నట్టేట్లో దింపిన వాణ్ణవుదును.

శ—మీపిల్ల ఎవడి క్కావలయ్యా, బాబూ! (అని వెకిలిగా దీర్ఘాలు తీస్తూ దణ్నంపెట్టి లెంపలు వేసుగుంటాడు)

అ—అల్లాఅన్నావు, నచ్చింది. ఉండు. (అని, ఎడమమధ్య ధ్వని ఆలకించినట్టు నటించి, అటుపరకాయించి) బాబోయ్, కొంపలంటుగున్నాయి, ఆయిద్దరు స్త్రీలూ తిట్టుగుని రక్కుగుని కొట్టుగుంటున్నారు. మీరు తనకే భర్తఅంటే తనకే భర్తఅని ప్రతి స్త్రీ దెబ్బలాగుతోంది. ఇద్దరికీ ఋజువులున్నాయిట.

శ—మీఅమ్మాయినిరుడా వెళ్ళమనండి, పూర్తవుతుంది.

అ—మాఅమ్మాయి అల్లాంటి రకంకాదు.

శ—నిజమే మరీ. మీఅమ్మాయి ఆడవాళ్ళ వెనకాల కాదు. పాపం, మొగాళ్ళ వెనకాల పరిగెడుతుంది.

అ—ఏమిట్రా నీ పేలాపనా, వెర్రిపీనుగా! కర్రతెస్తా నుండు. (అని కుడిమధ్యకి పరిగెడతాడు)

శ—అయ్యో! ఏమిటి నాకీ గ్రహచారం! వీడు నిజంగా తెస్తాడేమో కర్ర! అపవాదలకి తోడు, దెబ్బలుకుడా పడాలి. (దిక్కులుచూసి) ప్రస్తుతం ఇట్లా పోదాం (అని ఎడమ మూల కేసి పరిగెట్టుకుపోతాడు)—(తెర)

## రం గం - 7

[వీధి. తెర లేవగానే శరకోపం ఎడమ ఎదరనించి గబ గబా విచారంతో వస్తాడు. కుడి ఎదరనించి మాలోకం వస్తూంటాడు)

శ—అయ్యో! వీళ్ళని తగలెయ్యా! నన్ను ఖైమాచేశారు, ఖూనీ చేశారు, ప్రతీచోటా తలో ఖూనీ చేశారు నన్ను! అబ్బ అబ్బ! దిక్కుమాలి ఊరు. యమబాధ.

మా—(తాపీగా) అదేమిటండీ; ఎదేనా వైపరీత్యం జరిగిందా?

శ—వైపరీత్యమా! ఈఊరు డాక్టర్లనీ భార్యల్నీ తెగ ఈనేస్తోంది.

మా—నాకు బోధపడలేదు.

శ—ఇందాకా డాక్టర్లగురించి చెప్పానా! దరిమిలాని మళ్ళీ ఎంత జరిగిం దనుకున్నారు! అభిషేకం గారితో మాట్టాడి నేను మరి వచ్చేద్దాం అనుకుంటూంటే, ఒక తుంటరి స్త్రీ చక్కా వచ్చి, నన్ను ఉద్దేశించి 'నాథా నాథా' అంటూ రావణాగోల మొదలెట్టింది.

మా—పాపం! ఆవిడ పతివ్రత గావును, లేకపోతే పబ్లీకున గొడవ చెయ్యగలదా?

శ—దిబ్బ! దిబ్బా దిరుగుండమూను! నేను పెళ్ళి ఏడవందే టండీ. ఇంతవరకూనూ!

మా—మరుపు ఎంతవాళ్ళకేనా ఉంటుంది, ఏ విషయంలో నేనా ఉంటుంది.

శ—ఏడిసినట్టే ఉంది. మరిచిపోయి మరిచిపోయి పెళ్ళా మరిచిపోడం! దాన్ని చంపెయ్యా, ఒకదాన్ని ఎల్లానా విరగడ చేసుగోడం అని తటపటాయిస్తూంటే, మరో రాలుగాయి స్త్రీ వచ్చింది అయిదారుగురు పిల్లల్ని వెంటేసుగుని.

మా—ఇంకేం! మీ ప్రథమ కళత్రం గావును. ఆవిడయందు మీ కెందరూ సంతానం?

శ—అంతర్య స్నేహితులైన మీరే నన్ను ఇల్లా అర్థం చేసు గుంటూంటే, ఏమిటి నాకు దారి?

మా—ఛ ఛ ఊరికే అన్నానండీ. (మొఖం తీవ్రంగా పెట్టి) కాలి చెప్పుతో దవడఖుద్ధి చేసి అవతలకి పొమ్మని గెంటెయ్యక పోయార్టండీ, ఒక్క దెబ్బని దాన్నీ ఆ బాల సంఘాన్నినీ!

శ—అల్లాంటిపనే చేద్దాం అని నాకూ అనిపించింది. ఇంతలో ఆ స్త్రీ లిద్దరూ కలబడ్డారు—'నా మొగుడే శఠకోపం' అంటే నా ముగుడేశఠకోపంఅంటూనూ, ఆ వీధులో దోమెడుజనం జేరారు!

మా—ఆ జనాన్ని కొడదాం, రండి.

శ—అబ్బ వద్దు. ఈ సలిలం విషయం ఇన్ని వీళ్ల వాదులు ఖుంటాను. ఈ అభిషేకానికి ఒక దణ్ణం. నాకు పెళ్ళే వద్దు

దైవమా ఇంతటితో పోదాం అనుకుంటూంటే, నాకు లోగడే రెండు పెళ్ళిళ్ళు నాకు తెలియకపోయినా రూఢిగా అయినా యని మొదలెట్టారు తక్కిన వాళ్ళంతా! వాళ్ళు నాశనం అయిపోనూ!

మా—మీరు వాగ్దానాలు చేశారేమో! పనితొందరలో మరిచి పోయారేమో!

శ—పోనీ మొదటి పీనుక్కి వాగ్దానం చేశాననుకో! రెండో దానికి -- అది ఓ మంద పిల్లల్ని కుడా తోలుకొచ్చింది పిల్లల కోడిలాగ! చూశారా! సిగ్గులు పోయినాయండీ స్త్రీలకీ!

మా—నిజమే. బుద్ధులు నశించాయండీ పురుషులకీ!

శ—మరో చిక్కొచ్చింది.

మా—ఏం చిక్కు?

శ—ఆ యిద్దరి స్త్రీలూ పూర్వాన్నించీ భార్యాలే అని వేరు వేరుగా లిఖిత పూర్వకంగా ఋజువులు తీసుగొచ్చి చూపిస్తారుట.

మా—ఆఁ ఏముందీ. మనవర్తులకోసం గావును!

శ—ఆఁ, అవి మాత్రం త్వరగా తెముల్తాయా? నోటీసులు, విచారణస్థల నిర్ణయాలు, ప్లెయింటులు. ఎనెక్షర్లు, సమన్లు, వకాలత్‌లు, సాక్ష్యాలు, సంపన్నాలు, వాయిదాలు—ఇల్లాగ్గా కోర్టు తంతు నడుస్తుంది.

మా— మీకు న్యాయ శాస్త్రం బాగా వచ్చునండీ!

శ—అబ్బే, నేనా శాస్త్రం చదువుకోలేదు. చిన్నప్పణ్నించీ నామాటధోరణే సహజంగా అల్లా అయిపోయింది. అదిగాక నాది మాంచి ఇంగితజ్ఞానం. దాంతో కొట్టుగుపోతున్నాను, ఎన్ని ఒడిసుట్లు వచ్చినా!

మా—ఏమో మామూలు వాళ్ళకి ఈధోరణి అబ్బదు.

శ—అయినాసరే. ఎవరేనా లాయర్ని సలహా చేద్దాం నడవండి. ఈవ్యవహారం చూసుగుని మరీ పోతాను, ఈ ఊర్నించి.

మా—రండి. పెద్ధ వకీలింటికివెళదాం. ఎంత చిక్కొచ్చిందీ!

(అని కుడి ఎదరికి ముందుగా, నడిచిపోగా, శఠకోపం అతని వెనకాలే వెడతాడు).

## రంగం-8

[వీధి, తెరలేవగానే, కుడిఎదర నించి మాలోకమూ, ఎడమ ఎదరనించి నవనీతమూ వచ్చి కలుస్తారు]

న—ఏంమాలోకం! ఎట్లాఉంది. వ్యవహారం?

మా—నిమ్మకాయ వాటంగా ఉంది.

న—విజయం?

మా—తప్పదు.

న—తప్పదులే! మనకేనా అని.

మా—సందేహమా! శఠకోపం లోకం అంటే ఎరగడు.

న—బుద్ధి?

మా—మట్టి—చౌడు.

న—ధైర్యం?

మా—తారు. ఇక్కడి న్యాయచట్టాలు తెలుసుగునీ బెంగెట్టుకున్నాడు.

న—అతని కార్యక్రమం ?

మా—శీఘ్ర పలాయనం.

న—అంతటితో ఆఖరేనా మనఆట ?

మా—పలాయనం అంటే అనుకున్నంత తేలికకాదు. నగర ద్వారాలదగ్గిర మీకోసం జనం కాశారు, పోల్చి పట్టేస్తారు, అని వాడికి పిరికిమందు వేశాను.

న—మరి ?

మా—మరేముందీ, ఆడవేషం వేసుగుని వెళ్ళిపొమ్మన్నాను.

న—బలే. ఆడవేషంలో కుడా అతణ్ణి చూడవలిసిందేనూ !

మా—జాగర్తండోయ్. ప్లానుప్రకారంమే చెయ్యాలి, ఏం చేసినా ! నేను అతనితో వ్యవహరించే వేళ మీరు వెళ్లి....(అని చెవులో ఏదో చెప్పినట్టు నటించి) తెలిసిందా ?

న—ఆ.

మా—ఇతణ్ణి ఆడవేషంలో ఇక్కడ వొదిలి, నే వెళ్ళి అభిషేకంగారితో....ఊఁ....అది !

న—(తలతిప్పుతూ) అవును, అదే ఎత్తు.

మా—మరి సరి. మన నూతన వధువు-శఠకోప రూపిణి- ఇల్లా వస్తోంది. (అని ఎడమ ఎదర చూపించి) మీరు ఇల్లా (కుడి ఎదర చూపిస్తూ) వెళ్ళండి. మనం కలిసినప్పట్లో వారు చూడ కూడదు.

న—(కుడి ఎదరకి పోతాడు)

శ—(ఆడవేషంలో సన్నటి బట్ట ముసుగువేసుగుని ఎడమ ఎదరనించి వస్తాడు)

మా—రండి, రండి. మిమ్మల్ని గుర్తుపట్టడం బ్రహ్మతరం కాదు. మీరు అచ్ఛంగా గొప్ప కులకాంతలా కనిపిస్తున్నారు.

శ—ఈసీమలో న్యాయం దొత్తిగా పాడైందే అని నాకు ఆశ్చర్యం వేస్తోంది.

మా—నిజమేనండి. ఇక్కడ ఓం ప్రథమంలో ఉరి తీసెయ్యడ మున్నూ, తరవాత నిమ్మళంగా విచారణ ప్రారంభించడమునూ!

శ—అటువంటిది ఎంత అన్యాయమైన న్యాయమో చిత్తగించారా?

మా—చాలా రాక్షసంగా ఉంది.

శ—అందులోనూ అమాయికులపట్ల మరీ రాక్షసం అనిపిస్తుంది.

మా—పైగా, మిత్రమా! ఆ పిల్లిసీమవాళ్ళంటే ఈ ఊరు జనానికి మరీ ఆగ్రహం. వాళ్ళని ఉరితీసినకొద్దీ వీళ్ళకి పండగ.

శ—ఓరి వీళ్ళు ఇద్దైపోనూ! వీళ్ళకి మాసీమవాళ్లు చేసిన ద్రోహ మేమిటండీ?

మా—నాకెల్లా తెలుస్తుందండీ! వీళ్లు శుద్ధమృగాలు. ఇతర ఊళ్ళవాళ్ళ నెమ్మదీ ప్రజ్ఞాఅంటే వీళ్ళకి పడనేపడదు. మిమ్మల్ని గురించి నాకు మరీ భయంగా ఉంది, మిమ్మల్ని ఏంచేసిపోతారో అని.

శ—ఏంజేస్తారు మహా! చంపుతారు. ఇంతేనా! మరణం అంటే నాకు భయమేలేదు. అది నయం. కాని స్త్రీలు వస్తూండడం, నాథానాథా అంటూ పిలవడం, మనువర్తులు కోరడం—ఇవీ నాకు భయంవేసేవి. నా దర్జా పోతోంది.

మా—నిజమేనండి. కాని, ఇప్పుడు మీరు స్త్రీపాత్ర అభినయించాలి-ఆ వైఖరీ, ఆ మాటా, ఆ నడకా, ఆ ధోరణీ చూపించాలన్న మాట.

శ—ఏమీ ఫర్వాలేదు. నేను బోలెడుమంది స్త్రీల వైఖరులు గమనించాను, గనక వాళ్ళని అనుకరించగలను. రూపంలోనూ చాలావరకు మారిపోయానుగాని నాకల్లా చిక్కు ఒక్కటే పట్టుకుంది.

మా—ఏమిటదీ!

శ—కాస్త మీసం మిగిలిపోయింది.

మా—ఓస్, ఇదిటండీ! ఆపట్టింపు మీకక్కర్లేదు. ఈమాత్రం మీసంగల వురుషేతరులు లేకపోలేదు. ఎదీఎదీ, ఒక్క ఆడవిసురు చూపించండి.

శ—(స్త్రీలాగ సిగ్గు అభినయించి నుంచుంటాడు)

మా—నడవండి.

శ—(స్త్రీలాగ తక్కుతూ నడుస్తాడు).

మా—తిప్పుగోండి.

శ—(స్త్రీలాగ నడుం ఊగిస్తాడు)

మా—ఓహ్హో. మీకీచేష్టలన్నీ సహజంలా కనిపిస్తున్నాయే!

శ—(మెడరుబ్బుతూ, గడ్డంకింద వేలెట్టుగుని, కళ్ళు మిటకరిస్తాడు).

మా—బలే, రెండు మాటలుకుడా అనండి.

శ—(అభినయిస్తూ) ఏం? నాబండీలేదూ? ఏదీ నాబండీ! ఏమిపాట్లర్రా! కర్మంకొద్దీ దొరుకుతారు, ఇటువంటి దాసీలు! ఏమర్రా! రాత్తిరి దాకా వీధులోనుంచోనా! ఎవళ్ళైనా బండీ పిలవండర్రా!

మా—చాలా బాగుందిస్మండి.

శ—(అభినయిస్తూ) ఎవరోయ్! బండి అబ్బాయి! ఏమి పొగరూ! కుర్రాడా, ఓరి కుర్రాడా! ఏమికొవ్వూ! ఉండు. తిరిగొచ్చి కొరడా తిరగేస్తాను—పొట్టి కుర్రాడా, ఎక్కడరా, నీమచ్చ మాయా, భూమ్మీద లేకుండాపోయాడు వీడు. ఎవళ్ళో వెళ్ళి వాణ్ణేనా పిల్చుగు రారేం ముద్దుల్లాగ!

మా—అత్యద్భుతంగా ఉందండీ, ఒఖ్ఖవిషయమే కొంచెం అసందర్భంగా ఉంది. ఈపైముసుగు మరీ పల్చగాఉంది. వెళ్ళి కొంచెం దళసరిముసుగు తెస్తాను. మీ మొహానికి మంచి ముసుగుంటే ఎవ్వరూ మిమ్మల్ని చూడకుండా అందర్నీ మీరు చూడచ్చు.

శ—మీ రొచ్చే లోపల నేను ఏంజేస్తూండనూ!

మా—నాకోసం ఎదురు చూస్తూండండీ! ఇక్కడున్నట్లు వచ్చేస్తాను. అటూ ఇటూ తలాయిస్తూ ఉండండి. (అని కుడి ఎవరకి పోతాడు)

శ—(కొంచెంసేపు ఇటూ అటూ తిరిగి, ఎడమ ఎదరకేసిజరిగి, ఆగి, నిదానించి, భయపడి) బాబోయ్! ఇరుగో ఇరుగో ఎవరోతుంటర్లు! నన్ను చూశారు, ఇల్లావస్తున్నారు. తాగినట్లు తూల్తున్నారు. ఇహ వచ్చిపడతారు. ఏం దారి భగవంతుడా! (కుడివేపుసూచిస్తూ) ఇల్లా పారిపోతే, నయమే, కాని. ఆ స్నేహితుడు నేను కనిపించకపోతే వెతుక్కుని బాధపడతాడు. మళ్ళీ ఎడమ ఎదరచూసి) అరుగో పొగరుమోతులు, నవ్వుతున్నారు. గాలిలోముద్దులు పెట్టుగుంటున్నారు. మీ ముద్దులు ముక్కలైరి గదర్రా, బడుద్ధాయి గాడిదల్లారా! నేను పట్టుపడి పోతాను. వాళ్ళిద్దరున్నారు. నేను కొంచెం అల్లరి చేస్తేగాని ఈ గండం గడవదు. (అని

కుడివేపు వెళ్ళి) ఏమండోయ్, ఎవరేనా పుణ్యాత్ములు రండి, రండి. వచ్చి రక్షించండి. తుంటర్లు నన్నుచంపి దోచుగోడానికి వస్తున్నారు, రండి బాబూ రండి.

[పోలీసువేషంలో తలుపులు కుడి ఎదరనించి వస్తాడు]

త—ఏయ్! ఎవరమ్మా అదీ!

శ—(సిగ్గుపడుతూన్నట్లు) నేనండీ. ఒక చిన్నదాన్ని.

త—ఏమిటి తమబాధ?

శ—(ఇంకా సిగ్గుతో తలవంచుగుని) మరండీ! (అని, చిరునవ్వుతో లాగ) తుంటర్లవల్ల బాధండి.

త—ఎరీ?

శ—మీరు రావడం కనిపెట్టి ఈ వేపు పరిగెటారండి. (అని ఎడమ మధ్య చూపిస్తాడు)

త— (ఎడమ మధ్యకి పరిగెట్టి వెళ్లివచ్చి) వాళ్ళని తరిమేసి వచ్చానండి, వాళ్లు పారిపోవడంలో ఒకరిమీద ఒకరు పడిపోయారు. మీరు భయపడకండి,

శ—(చనువుగా) మీరుంటే నాకు భయం ఎందుకండీ! మీకు దణ్ణంఅండి. మీకు ఎంతేనా కృతజ్ఞురాల్ని.

త—(శరకోపం మొహం పరీక్షగా చూసినట్టు నటించి) ఉండండి, ఈ ముఖం వర్ణన నేను లోగడ ఎరుగున్నట్టుందే!

శ—అబ్బెబ్బే! మీ రెరుగున్నట్టున్న మొహం మరొకరిదె ఉంటుంది. నా మొహం కాదు.

మా—మీ మొహం కాదూ? మీ మొహంలా ఉంది! అసలు మీరు అల్లా ఎందుకు అనవలి సొచ్చింది?

శ—నాకేమీ తెలియదండి, అమాయికపుమనిషిని.

త—మీమాటలు కొంచెం ద్వంద్వంగా అర్థమిస్తున్నాయి. అందువల్ల మీరు నాఖైదీ,

శ—మీకు మొక్కుతున్నాను, రక్షించండి.

త—వీల్లేదు, వీల్లేదు మీ ముఖవైఖరీ మాట వైఖరీ గమనించగా, మీరు కేవలం ఆశఠకోపంగారులా ఉన్నారు, వారు పరారీ అయారని తెలిసి వారికోసం మేం వెతుగుతున్నాం. మీరు మమ్మల్ని మోసపుచ్చుదాం అనుకున్నారు గాని వ్యర్థం అయింది. పదండి ఖైదులోకి.

శ—అయ్యో, నా అవస్థా!

మా—(కుడి ఎదర్నించి వచ్చి) హా దైవమా! ఏమటీ అవస్థా!

శ—అవస్థేనండి. నేను స్త్రీని కానట్టు పోల్చేశారండి.

త—నేనేనండి పోలుస్తా. మా క్షోభ తగ్గిపోయింది కుడానూ!

మా—(తలుపులుతో) అయ్యా అయ్యా! నన్ను చూసి వార్ని విడిచిపెట్టండి. మేం చిరకాల స్నేహితులం.

త—మేం చెయ్యగలది ఏమీ లేదు.

మా—అయ్యా! మీరు సబబుకి కట్టుపడే న్యాయ ప్రభువులని నాకు తెలుసు. సబబైన మొత్తం కొంత తమరు పుచ్చుగుని, మార్గాంతరం కనిపెట్టుగోడానికి న్యాయం ఒప్పదంటారా?

త—అయితే ఉండండి, నా తోటివాళ్ళందర్నీ పంపించేసి వస్తాను. (అని కుడిమధ్యకి వెడతాడు).

మా—మిత్రమా! కొంతసొమ్ము పైకి తియ్యండి. ఎంతో కొంత చేతిలో పడితేగాని, వాడు మిమ్మల్ని వదలడు. త్వరగా తియ్యండి పది.

శ—(ఒకనోటు తీస్తూ) వచ్చి వచ్చి రాక్షసి ఊరొచ్చాను, తీరిపోయింది. ఇదిగో (అని ఇస్తాడు)

మా—(నోటు పుచ్చుగుంటాడు)

త—(కుడిఎదర్నించి వచ్చి) నాతోటి వాళ్ళని పంపేశానండీ. ఏదీ మీసబబు కానీండి.

మా—ఇదుగోనండి. (అని పది–నోటు ఇయ్యబోతాడు)

త—ఎంత ఆసొమ్ము?

మా—పదండి.

త—టట్! పదండిఖైదులోకి. మా అధికారి మా చెడ్డ కరకట్టురకం (అని కుడివేపు వెళ్ళిపోవడానికి యత్నిస్తాడు)

మా—(తలుపులుతో) అయ్యా, దయచేసి ఆగండి. (శరకోపంతో) అయ్యా, మీరు కిక్కురుమనకుండా మరొక్క–నోటు రానీండి ఇటువంటిది!

శ—అయితే........

మా—అయితే గియితే అంటూ నాన్చడం ప్రారంభించారా మీకు ఖైదు తప్పదు. ఖైదు నయమా? కాగితాలు రెండు గిరవ పెయ్యడం నయమా? త్వరగా తియ్యండి.

శ—నా ఖర్మం కాలింది. పుచ్చుగో (అని, మరో పదినోటు ఇస్తాడు)

మా—(అది పుచ్చుగుని) ఇవిగోనండి.

త—(మళ్ళీ పది కలిపి పుచ్చుగుని) సరే. ఈయన్ని నేను క్షేమంగా తీసికెడతాను. ఈయన్ని గుప్చిప్‌గా దాటించెయ్యాలి, నే నెళొస్తాను. మీ రుండండి.

మా—చిత్తం, వీరి పూచీ యావత్తూ మీది.

త—ఆ. వార్ని పొలిమేర దాటించి వచ్చే భారం నాది!

మా—మిక్కిలి జాగర్త స్మండీ!

శ—(తనలో) ఔర! ఈయన కెంత అప్యాయమో! ఈ వూళ్ళోకల్లా నిజాయితీమనిషి ఈయనగదా! (పైకి) నడవండి, బాబూ!

త—రండి. (అని కుడిఎదరకి పోగా, వెనకాలే శఠకోపం వెడతాడు. మాలోకం ఎడమ ఎదరికి పోతాడు)—(తెర)

## రంగం-9

[అభిషేకంగారి ఇంటి ఎదటిస్థలం. ఎడమ మధ్య నించి మాలోకం ప్రవేశిస్తాడు]

మా—(కుడిమధ్యకి నడిచి) అయ్యగారండీ! ఏమండోయ్. అభిషేకంగారు!

అ—(కుడిమధ్యనించి వస్తూ) ఏం ఎవరదీ?

మా—ఇక్కడ శఠకోపంగారున్నారాండీ?

అ—ఏమో ఎక్కడున్నాడో. ఆ వెర్రి చవట.

మా—మీది పొరపాటేమో కాని, వాడంత మరీ వెర్రి చవట కాడు లెండి.

అ—ఏం?

మా—అయిఉంటే మీకింత ద్రోహం చేస్తాడండీ?

అ—నాకు ద్రోహమా?

మా—నాకు మీరంటే చాలా జాలేస్తోంది.

అ—ఏంజేశాడూ?

మా—ఏంజేస్తాడూ, మీ అమ్మాయిని అమాంతంగా లేవదీసుకు చెక్కాపోయాడు,

అ—మా సలిలాన్నే!



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA130B175 |
| పుస్తకం పేరు | స్వరాజ్యం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |